14-8-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 63 సంచిక :33 విడిప్రతి : రు. 2.00 లు

Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



## ప్రతిఘటనకు ప్రభుత్వ సన్నాహాలు

# ఊపందుకుంటున్న ఉద్యమాలు

మెడికల్ కాలేజీల నిప్పు నెమ్మది నెమ్మదిగా రాజు కుంటున్నది. అది రాజుకుంటుందనడం కన్నా ప్రతిపక్షాలు రాజేస్తున్నాయనడం సబబు. జనార్ధనరెడ్డి ప్రభుత్వంపై పోరాటానికి ఏ సాకూ చిక్కక, ఏ మార్గమూ లభించక దిగులుపడి వుండిన తెలుగు దేశం పార్టీకి ఈ కాలేజీల వ్యవహారం సంతోషం కల్గిస్తున్నది. ఉద్యమం మొదలు పెట్టవలసిన అగత్యమూ వారికి ఏర్పడలేదు. విద్యార్థులే ఆ పుణ్యం కట్టుకున్నారు. హైదరాబాదు, కర్నూలు, విశాఖపట్టణం, విజయవాడ వంటి నగరాలలో విద్యార్థులు, మెడికోలు తమంతట తాముగా వీధుల్లోకి వచ్చి ఆందోళన ప్రారంభించారు. అనూహిత పరిణామం ఇది. మెడికల్ కాలేజీల జిఓ విడుదలైనపుడు ప్రతిపక్షాలు పెద్ద రచ్చ చేస్తాయని భావించారు కాని, విద్యార్థులవైపు నుంచి ప్రతిఘటన ఎదురౌతుందని ఎవరూ ఊహించలేదు. ఉద్యమాలు, ఆందోళనలు జనార్ధనరెడ్డి గారికి కొత్తకాదు. తన రాజకీయ జీవితంలో అటువంటి సంఘటన లెన్నింటినో నేర్పుగా ఎదుర్కొన్న అనుభవం వుంది. అందువల్లే రాష్ట్రమంతా అలజడి రేకెత్తుతున్నా నిబ్బరంగా వుండగల్గుతున్నారు ముఖ్యమంత్రి. ఈ ఉద్యమంలో విద్యార్థుల పాత్ర నామమాత్రమని, రాజకీయ వాదులే వెనుక చేరి వారిని రెచ్చగొడ్తున్నారని ముఖ్యమంత్రి నిశ్చితాభిప్రాయం. ఆ ఉద్దేశ్యంతోనే ఆయన దీనిని రాజకీయంగా ప్రతిఘటించే నిర్ణయం తీసుకున్నారు. హైదరాబాదులో మెడికోల ఆందోళనకు ప్రతిగా, మెడికల్ కాలేజీలు పెట్టాలని కోరుతూ విద్యార్థుల చేత ఒక ప్రదర్శన నిర్వహించారు. ప్రభుత్వ అనుకూల వర్గాలు వివిధ టౌన్‌లలో కాలేజీ అనుకూల ఊరేగింపులు ప్రారంభించాయి. ఇది రాష్ట్రంలో ఉద్రిక్తతకు దారి తీస్తున్నది. పోలీసులు ఈనాటివరకు సంయమనంతోనే వున్నారు. లాఠీ చార్జీకి మించి తొందర పడడం లేదు. పోలీసులలో ఓర్పు వున్నంత కాలం ఏ ఉద్యమమైనా శాంతి యుతంగానే వుంటుంది. వారు తుపాకీ ఎత్తితేనే ప్రమాదం.

### వివాదాస్పదమై పోయిన మెడికల్ కాలేజీలు

ముఖ్యమంత్రిపై అపరిమిత ఈర్ష్యా ద్వేషాలతో మండి పడుతున్న అసమ్మతి వాదులు ఉద్యమాన్ని ప్రశాంతంగా జరగనిస్తారా అన్నది సందేహం. ప్రతి పక్షాల కంటే వారినుంచే ప్రమాదం ఎక్కువ. జనార్ధనరెడ్డికి పదవీ గండం కల్పించడానికి ఇది చివరి అవకాశంగా భావిస్తున్నారు వారు. రేపు అసెంబ్లీలో ఈ విషయం ప్రస్ఫుటమౌతుంది. ఒక్క తెలుగు దేశం మినహా తక్కిన ప్రతిపక్షాలేవీ ఈ విషయంలో ఉధృత ధోరణిలో వ్యవహరించక పోవడమొక్కటే ముఖ్యమంత్రికి ఊరట కల్గించే విషయం. ఖమ్మం కాలేజీ మంజూరులో తమ పలుకుబడి వుందన్న సంగతి బయటపడి పోవడంతో కమ్యూనిస్టులు ఇరకాటంలో పడ్డారు. ఎన్టీఆర్ బహిరంగంగా దాన్ని ఎత్తిచూపడం వారి ప్రతిష్ఠను దిగజార్చి వేసింది. ఇప్పుడు ఇటు ఉద్యమంలో చురుకుగా పాలుపంచుకోలేక, అటు బాహాటంగా కాలేజీల ఏర్పాటును సమర్థించలేక సతమత మౌతున్నారు. జనార్ధనరెడ్డి ఘటనాఘటన సామర్థ్యానికి కమ్యూనిస్టులు తలవంచక తప్పలేదు.

నెల్లూరు జనప్రియ మెడికల్ కాలేజీతోను, వాకాడు ఇంజనీరింగు కాలేజీతోను తనకు సంబంధం లేదని ముఖ్యమంత్రి హైకోర్టులో అఫిడవిట్

తరువాయి 6 పేజీలో



ఇఫ్కో అధ్యక్షుడు పెళ్లకూరు రామచంద్రారెడ్డి అభినందన సభలో నిర్వహాక ద్వయం - కొండా బలరామరెడ్డి, మేనకూరు గోపాలకృష్ణారెడ్డి, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, పెళ్లకూరు,అవధాని. శ్రీమతి అవధాని.

# నాకు ఇద్దరు దేముళ్లు — గుడిలో ఒకరు, పివిరూపంలో మరొకరు!

'ఇఫ్కో' చైర్మన్ పెళ్ళకూరు రామచంద్రారెడ్డి గారిని మెగొరె, కొంబరెల ఆధ్వర్యంలోని అతిథేయి సంఘం 9 తేది అట్టహాసంగా సన్మానించింది. అతి పొదుపు పాటించి, ఆడంబరం సృష్టించె మెగొరె నైర్పరితవానికి విలువు టద్దమా సత్కారం.

ఇఫ్కో చైర్మన్‌గా నియమితులైన తర్వాత రామచంద్రారెడ్డి గారు నెల్లూరు రావడం ఇదే ప్రథమం. ఆయన తరచు నెల్లూరు రావడం కూడా కుదరదేమో! కోస్తాంధ్ర మండలి అధ్యక్షత తర్వాత ఆయన చేపట్టిన పదవి ఇదే! కాని, దానికి దీనికి పోలికే లేదు. అక్కడ చేయడానికి పని, చూడడానికి ఫైలు వుండేవి కావు. ఇఫ్కోలో ఆయన ఇరవై నాలుగు గంటలు పని చేసినా కొరవ పడుతుందే తప్ప, పూర్తి కాదు. 6 వేల మంది ఉద్యోగులు, మందీ మార్బలం, నాలుగు చోట్ల ఫ్యాక్టరీలు, వెళ్లిన దగ్గరల్లా రాచమర్యాదలు, అతిథి భవనాలు 'ఇఫ్కో' పదవితో సంక్రమిస్తాయి. ఐదువేల కోట్ల ఆస్తిపాస్తులకు -అధ్యక్షుడే పర్యవేక్షకుడు. ఏడాదికి ఏడెనిమిది వందల కోట్ల కొత్త ప్రాజెక్టుల నిర్మాణం చేపట్టేందుకు వీలుంది. పేరుకు ఎరువుల సంస్థ అయినా - రైతుకు సంబంధించిన ఏ వ్యాపకమైనా చేపట్టేందుకు వారికి

## సన్మాన సభలో పెళ్ళకూరు

స్వతంత్రం వుంది. పదిమందికి సాయపడే సావకాశం వుంది. ఈ ఆకర్షణే 9 తేది కస్తూరి బా కళాక్షేత్రం కిటకిటలాడడానికి, ఎప్పుడూ ఎవరికీ సన్మానాలు తలపెట్టని 'అతిథులు' ఆతృత ప్రదర్శించడానికి కారణం.

ఉద్దేశ్యాలేవైనా - సన్మాన సభ మాత్రం చాలా ఆత్మీయంగా జరిగింది. డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు అధ్యక్షించారు. అభిమానుల పూలమాలల సత్కారమే ఒకటిన్నర గంట పాటు సాగింది. వందల కొద్దీ మాలలు రాశిపడ్డాయి. వాటిన్నంటినీ ఒక చోట చేరిస్తే ఒక లారీకి సరిపోతాయేమో! ఆ బరువుకు రామచంద్రారెడ్డి గారి మెడ వంగిపోక పోవడం ఆశ్చర్య పడాల్సిన విషయమే. ఆయనకు అందరు అభిమానులున్నారా అన్పించింది.

నిర్వాహక ద్వయంలో 'శ్రామికుడు' శ్రీ కొండా బలరామరెడ్డి సన్మాన పత్రంతో సభారంభం; వేదిక పైన కుర్చీల సంఖ్యకు పరిమితి లేదు. నిర్వాహక సూత్రధారి శ్రీ మెగొరె, ప్రధాని పి.వి. కుమార్తె శ్రీమతి ఎన్. శారదాదేవి, మాగుంట శ్రీనివాసులు రెడ్డి, గునుపాటి రామచంద్రారెడ్డి, వేమారెడ్డి రామ చంద్రారెడ్డి, డాక్టర్ బి. సుందర రామరెడ్డి, జెకరెడ్డి, సివి శేషారెడ్డి, నేదురుమల్లి పద్మనాభ రెడ్డి, కలెక్టర్ కె. రాజు, జాయింట్ కలెక్టర్ ఎం. సాంబశివరావు ఇఫ్కో రీజనల్ మేనేజర్ సుబ్బారావు తదితరులంతా వేదికపై ఆశీనులైనారు.

మద్దాలి మల్లిఖార్జున రావుతో ఉపన్యాసాల పర్వం మొదలు; ఆత్మీయంగా, అనురాగ పూరితంగా రెండే రెండు మాటలు మాట్లాడి దిగారు. న్యాయవాది శ్రీ పి.వి. రమణారెడ్డి, పెళ్లకూరును రైతు పక్షపాతి అన్నారు; మెగొరె- రామచంద్రారెడ్డి ధన వ్యామోహం లేని వాడని కితాబు ఇచ్చారు. పెళ్లకూరు అనుచర ముఖ్యుడు శ్రీ పాళెం సుబ్బారెడ్డి - ఇన్నాళ్లకైనా తమ నాయకుడికి గుర్తింపు లభించినందుకు ఆనంద పడ్డారు. వక్తలందరూ పెళ్లకూరు నిజాయితీని, నిరాడంబరతను, అన్నదాన వ్రతాన్ని, ధార్మిక బుద్ధిని వేనోళ్ల కొనియాడారు.

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు - పెళ్లకూరు మొదటనుంచి కాంగ్రెస్ వాది కాకున్నా, కాంగ్రెస్ ద్వారా ఉన్నతిని పొందారని; క్విట్ ఇండియా స్వర్ణోత్సవం నాడు ఒక త్యాగశీలికి ఆత్మీయులు ఇంత పెద్ద సన్మానం జరపడం సంతోష దాయకమని ప్రశంసించారు.

8 వ పేజీలో



# పినాకిని తీరం

## పెళ్లకూరును శ్రమపెట్టారు!

'ఇఫ్కో' చైర్మన్ అయిన శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డిని శ్రీ మేనకూరు గోపాలకృష్ణా రెడ్డి చాల శ్రమకు గురి చేశారు. 9 తేది పెళ్లకూరుకు జరిగిన అభినందన సన్మాన సంరంభ వేడుక బహుశా ఆయన నలభై ఏళ్ల రాజకీయ జీవితంలో సాటిలేనిది కావచ్చు; అనుభవానమైనది కావచ్చు; అసలు ఇంత భారీగా జరిగే వుండకపోవచ్చు. మెగొరెకు పెళ్లకూరుతో వున్న అనుబంధం, లేక ఆయన పట్ల వున్న ప్రేమాభి మానాలు అంతగాఢమైనవో, లేక ఇప్పటి రాజకీయ పరిస్థితులలో తనకు అనివార్యమైన అవసరమో నేను వూహించలేను గాని, బైపాస్ ఆపరేషన్ చేయించుకొని, ఇంకా పూర్తిగా కోలుకోని పెళ్లకూరుకు నూటయాభై నిమిషాలకు పైగా అంత కఠిన శిక్షను విధించడం మాత్రం సమంజసం కాదు; ఎంత వుత్సాహమున్నా నాబోటి వాడు అటువంటి పనికి పూనుకోలేడు. పెళ్లకూరు సంగతి అటుంచి, అసాధారణమైన డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి గారి సహనం నాకు సంభ్రమాశ్చర్యాలు గొలిపింది!

షుమారు డెబ్బయ్ అయిదు నిమిషాల పాటు పెళ్లకూరుకు నిట్ట నిలువున నిలబడి పూలమాలలు, శాల్వలు, అతిథేయ సంఘం వారి వందకు పైగా శుద్ధ ఖద్దరు తుండుగుడ్డలు స్వీకరించడానికి సరిపోయింది. అసలు హాలులో కూర్చున్న వారిలో ముఖ్యులు ఎవరు ఎప్పుడు కనబడితే అప్పుడు వేదిక మీదకు పిలవడానికి, సన్మానించే వారి పేర్లను ప్రకటించాడానికి, అభినందన పత్రాన్ని స్ఫుటమైన తెలుగులో చదివి సమర్పించడానికి, ఇతర చిల్లర మల్లర పనులకు శ్రీ కొండాబలరామరెడ్డి పడిన శ్రమ అనిర్వచనీయం. వేదిక మీదకు పిలవడానికి బలరామరెడ్డి గారు మిస్ చేసిన ఒక ముఖ్యుణ్ణి మెగొరె పిలిచి లోపం పూరించాడు. ఆ ముఖ్యుడెవరో కాదు- నాలుగైదు సార్లు నిరాఘాటంగా పార్లమెంటుకు ఎన్నికైన కృష్ణ జిల్లా కాంగ్రెస్ నాయకుడు, మెగొరె కాలక్షేపపు మిత్రుడు శ్రీ మాగంటి అంకినీడు! అది కాదు గాని - మాటకొస్తే మోకాళ్లు నొప్పి మోకాళ్లు నొప్పి అంటుంటాడు మా గునుపాటి; అటువంటి వాడు అలాగ్గా అంత ఎత్తు వేదిక ఎక్కి వుచితాసనం మీద ఆశీనుడయ్యాడండి! కళాక్షేత్రం వేదిక పుష్పక విమానం వంటిదిగా వుంది; ఎన్ని పదుల మందిని సుఖాశీనులను చేసుకుందనుకున్నారు!

వేదికే గాదు, అంత పెద్ద హాలు కూడా కిటకిట మన్నది. వెనుదిరిగి చూచిన నా ప్రక్కనుండిన వున్నతాధికారి ఒకరు హాలు నిండిందే అన్నారు ఎంతో ఆశ్చర్యంతో! ఆ ఆకర్షణ అంత కాలంగా పెళ్లకూరు సొంతంగా సంపాయించుకున్నదే. కనపడిన ప్రతి మనిషిని పలుకరించకుండా వుండక పోవడం; ఎదుటి మనిషితో తెమ్మకొని అయినా చిరునవ్వుతో, ఆత్మీయంగా నోటి నిండా మాట్లాడడం; పని చేయగలగనీ చేయలేకపోనీ, ఆశ్రయించిన వారిని సంతృప్తిపరిచి పంపడం; అందరికీ అన్నివేళలా అందుబాటులో వుండడం; నిరాడంబరత.. ఈ గుణరాశితో పెళ్లకూరు ప్రజా సత్సంబంధాలను పెంచుకున్నారు; మొన్న ఆ మంచి ప్రతిబింబించింది! దానికి తోడు మెగొరె, బలరామరెడ్డి ప్రభృతులు ముఖ్యుల సమీకరణకు పోష శ్రమ తీసుకున్నారు. మరొక కారణం పెళ్లకూరు రాజకీయ జీవితంలో మొదటిగా జాతీయ స్థాయిలో రన్నీ వుండే పదవి రావడం. ఇంకొకటి ప్రధాని కుటుంబ సన్నిహితుడనే దానికి ప్రత్యక్షనిదర్శనంగా పి.వి. కుమార్తె, మనుమడు హైదరాబాదు నుండి ప్రత్యేకంగా వచ్చి ఈ సన్మాన సభలో పాల్గొనడం. ఆఖరుగా చెప్పాలంటే జనార్దన రెడ్డి వ్యతిరేక వేదిక ఇటీవల నెల్లూరులో దొరకలేదు - కొందరికి ఆ కొరత దీంతో తీరింది! ఏమైతే నేమి పెళ్లకూరు సన్మాన సభ ఆడంబర రహితమైందిగా, సహజమైందిగా, నిండుదనం గలిగిందిగా స్మృతిలో నిల్చిపోయేదే! పెళ్లకూరు రాజకీయ జీవితానికి ఒక పరిపూర్ణతను చేకూర్చేదే!

పెళ్లకూరును డాక్టర్లు రెండు నియమాలు పాటించమన్నారట - ఎక్కువ మాట్లాడ వద్దు; రెండవది ఎక్కువ శ్రమ తీసుకోవద్దు అనేది ఒకటి! రామచంద్రారెడ్డి గారు ఆ రెండు తప్ప తక్కిన ఆరోగ్య నియమాలన్నీ పాటిస్తున్నారు! అంత మాత్రానికి మద్రాసు అపోలో మొదలు ఢిల్లీ ఇండియన్ మెడికల్ ఇన్స్టిట్యూట్‌ల వరకు తిప్పుట ఎందుకు? అనారోగ్యము, పదవి ఒకే ముహూర్తాన వచ్చాయి. పదవీ స్వీకారము, శరీర స్వస్థత ఒకే సారి లభించాయి. రామచంద్రారెడ్డి గారు శరీర, పదవి ఆరోగ్యాలను కాపాడుకొని కీర్తివంతుడు కావాలని నా ఆకాంక్ష!

## శంకర రెడ్డి ప్రదర్శనం

ఆర్.టి.సి. ప్రాంతీయ ఛైర్మన్ పదవీ స్వీకారానికి శ్రీ చెలికం శంకర రెడ్డి చేసిన ఆడంబర ప్రదర్శనం తీవ్రమైన విమర్శలకు గురియైంది. అదెంత పదవి? దాని అధికారమెంత? దాని

8 వ పేజీలో

# జమీన్‌రైతు

## చీలిక రాజకీయం

జనతాదళ్ పార్టీలో చీలిక రాకుంటే వింతకాని, వస్తే చింత పడాల్సిన దేమీ లేదు. ఆ పార్టీ మౌలిక స్వరూపంలోనే చీలిక లక్షణం అంతర్లీనంగా దాగివుంది. కాంగ్రెస్‌పై వ్యతిరేకత, రాజీవ్‌గాంధీపై ఈర్ష్యాద్వేషాలతో పుట్టిన పార్టీ అది. ఆ ఏక సూత్రంపై ఏకీ భావం తప్ప, మరే సిద్ధాంతంపైన, విధానంపైన ఆ పార్టీలోని పెద్దలకు ఏకాభిప్రాయం లేదు. పరస్పర విరుద్ధ భావాలు, లక్ష్యాలు, పథకాలు, ఆశలు కల్గిన అధికార పదవీ వాంఛితుల కూటమి అది. అందువల్లే ప్రజలు అధికారం కట్టబెట్టినా, పంపకంలో వాటాలు కుదుర్చుకోలేక అధికారాన్నే వదలుకున్నారు. అధికార దాహంతో తపించిపోయే రాజకీయ వాదులెవరూ, తమకు సరి సమానమైన పదవీ వాంఛితులతో ఎప్పుడూ సహజీవనం చేయలేరు. విపిసింగ్, అజిత్ సింగ్, చంద్రశేఖర్, దేవీలాల్ వంటివారు ఈ కోవకు చెందినవారే. ఇప్పటికి ఏ నాలుగైదు సార్లో జనతాదళ్ చీలికలు, పేలికలైంది. ఇప్పుడు తాజాగా అజిత్‌సింగ్ ఆ పార్టీ నుంచి 12 మంది ఎమ్మెల్యేలను బయటకు తెచ్చారు. ఏడెనిమిది నెలలకు పైబడిన ప్రయత్నఫలితమిది. విపిసింగ్ ఈ ప్రయత్నాల్ని ఎప్పటి కప్పుడు అడ్డుగోడుతూ వచ్చారు. లోక్ సభలో ఆ పార్టీకి 59 మంది సభ్యులున్నారు. బిజెపి తర్వాత అదే పెద్ద పార్టీ. అందులో చట్ట ప్రకారం చీలిక రావాలంటే ఒకటింట మూడోవంతు - 20 మంది– సభ్యులు బయటకు రావాలి. అజిత్ సింగ్‌కు ఆ సంఖ్యలో సభ్యులు చిక్కకుండా చేయడానికి, విపిసింగ్ దఫాల వారీగా 8మందిని పార్టీనుంచి బహిష్కరించారు. ఇప్పుడు పన్నెండు మంది ఒక్కసారి వెలికి వస్తున్నారు కాబట్టి, ఇద్దర్నీ కలిపితే పార్టీలో చీలిక జరిగినట్లే లెక్క, అయితే బహిష్కరింపబడిన 8 మందితో, ఈ పన్నెండుగురిని కలపడానికి లేదని, చీలికకు తగిన సంఖ్యాబలం లేదు కాబట్టి, వీరిని లోక్‌సభ సభ్యత్వానికి అనర్హులుగా ప్రకటించాలని విపిసింగ్ వాదిస్తున్నారు. అజిత్ సింగ్ వాదన మాత్రం వేరే రకంగావుంది. తమను పార్టీనుంచి బహిష్కరించినప్పటికీ, సభలో తమకు ప్రత్యేక సీట్లు కేటాయించినప్పటికీ, తమతోటి బయటకు వచ్చేవారు ఇంకా వున్నారని తామానాడే స్పీకర్‌కు చెప్పుకున్నామని, అందువల్ల ఈ పన్నెండు మందీ ఫిరాయింపుల నిరోధచట్టం క్రిందకు రారని చెప్తున్నారాయన. దీనిపై స్పీకర్ నిర్ణయం ఏమిటనే దానిపై 12 మంది ఎమ్మెల్యేల భవితవ్యం తేలుతుంది. ఫిరాయింపుల నిరోధానికి ఎన్ని చట్టాలు చేసినా, రాజకీయ వాదులలో చిత్తశుద్ధి లేనంత వరకు వృధాయేననడానికి ఈ పరిణామాలే దృష్టాంతం. చట్టం స్ఫూర్తిని విస్మరించి నిబంధనలను మాత్రం పట్టించుకుంటుండడం వల్ల, చట్ట అతిక్రమణకు మార్గాలు వెతికే అలవాటు ప్రాచుర్యంలోనికి వస్తున్నది.

చీలికలు, ఫిరాయింపులు మనకు సర్వసాధారణమే కాని, ఈ చీలికలో డబ్బు ప్రధాన పాత్ర వహించిందన్న వార్త ప్రజాస్వామ్య వాదులందరినీ కలవర పరుస్తున్నది. దేశంలోని అత్యున్నత శాసన సంస్థలోని సభ్యులే డబ్బుకు అమ్ముడు బోయే పరిస్థితి ఏర్పడితే, ఇక ప్రజాస్వామ్యం నిలుస్తుందా? ఈ చీలికకు సారథ్యం వహించింది తానేనని జనతాపార్టీ నాయకుడు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి గర్వంగా ప్రకటించడం ఇంకా ఘోరం. మైనారిటీలో వున్న కాంగ్రెస్ ప్రభుత్వానికి బలం చేకూర్చడానికి, ప్రతిపక్షాన్ని ముక్కచెక్కలు చేసే ప్రయత్నంగా దీన్ని భావించాలి. దేశంలో సుస్థిర ప్రభుత్వం వుండడం అవసరమే కాని, అందుకోసం నైతిక ప్రమాణాలు తుంగలో తొక్కి, ప్రతిపక్షాన్ని ముక్కచెక్కలు చేసి, ధనాశతో సభ్యులను లోబరుచుకునే ప్రయత్నం చేయడం మాత్రం విచారకరం. ఇందులో సంబంధం వున్నా, లేకపోయినా కాంగ్రెస్ పేరుతో ఈ పాప కృత్యం జరగడం ప్రధాని పివి ప్రతిష్ఠకు క్షేమం కాదు. ఇప్పటికే తెలుగు దేశంలో చీలిక, ప్రధాని అభిమతం ప్రకారం జరిగిందనే నిందతోపాటు, చీలి వచ్చిన వారికి తగిన 'ఫలం' పంచి పెట్టడం జరిగిందనే ప్రచారమూ వుంది. రాజకీయలాలో ఇటువంటి చర్యలు ఎప్పుడైనా భస్మాసుర వరాల క్రిందే లెక్క, ఏదో ఒకనాడు అవి తిరిగి తమనే ఇబ్బంది పెట్టడం ఖాయం.

జనతాదళ్ కర్ణాటక విభాగం సైతం చీలిక దిశగా పయనిస్తుంది. విపిసింగ్‌కు పార్టీపై పట్టులేదు. ఒక్క బీహార్‌లో తప్ప, ఇంకెక్కడా ఆ పార్టీకి భవిష్యత్తు, మనుగడ వుంటాయన్పించడం లేదు. అతి త్వరలోనే మనం దాని సహజ మరణం చూడవలసి వస్తుందేమోనన్పిస్తుంది. జనతాదళ్ పతనం, బిజెపి వంటి మత తత్వ పార్టీలకు బలం చేకూర్చకుండా చూడవలసిన బాధ్యత లౌకిక వాదులందరిపైనా వుంది!

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

14-8-1942

8 పేజీలు-అణా

### అరెస్టులు-కాల్పులు

### గాంధీజీ అరెస్టు

8తేది రాత్రి అఖిల భారత కాంగ్రెసు సమావేశంలో మహాత్మాజీ ఎడతెగని ఉపన్యాసాలవల్ల అలసి పొయ్యారు. బొంబాయి పోలీసు కమిషనరు 9తేది ఉదయం5గంటలకు 3 కార్లు తీసుకొని, బిర్లా గృహగేటు కీపర్ను లేపి లోనికి వచ్చి మహాత్మాజీకి వారంటు తెచ్చానని కబురు జేసి అరగంట వ్యవధి ఇచ్చాడు. బిర్లాసతి మహాత్ముని నొసట కుంకుమ బొట్టు బెట్టి పుష్ప మాలాలంకృతుని జేసింది. మహాత్మా గాంధి, మిరాబేన్, మహదేవ దేశాయి గార్లను ముగ్గురిని అరెస్టు జేసిరి. పూనాకు సమీపంలో ఆగాఖాన్ బంగళా అద్దెకు తీసుకొని ఆ బంగళాలో మహాత్మాజీ, సరోజినీ దేవి, మీరాబేన్, మహా దేవదేశాయి గార్లను మాత్రం నిర్బంధంలో వుంచారు. తక్కిన వారిని కొందరిని యరవాడ జైలులో వుంచారు.

### కస్తూరిబా అరెస్టు

గాంధిగారు 9తేది పతాక ప్రతిష్ఠింపవలసి యుండగా వారి అరెస్టు అనంతరం తాను ప్రతిష్ఠిస్తా నన్నందున ఆమెగారిని, పారీల్యాల్ (గాంధిగారి కార్యదర్శి), డాక్టర్ సుశీలానాయరు గార్లను అరెస్టు జేశారు. బహుశా గాంధి గారి సన్నిధి కే చేర్చి వుంటారు.

### తక్కిన నాయకుల అరెస్టు

బొంబాయి వర్కింగ్ కమిటీకి హాజరైన సభ్యులందరినీ అంటే అధ్యక్షుడు అజాద్, నెహ్రూ, పటేలు, సరోజినిదేవి, పట్టాభి మున్నగు వర్కింగు కమిటీ సభ్యులను, బొంబాయి రాష్ట్ర ప్రముఖులను మొత్తం 54 మందిని అరెస్టు9తేది జేశారు.

దేశమంతా 9,10 తేదుల్లో అరెస్టైన ముఖ్యులు – రాజేంద్ర ప్రసాద్, కొండా వెంకటప్పయ్య పంతులు, కాళేశ్వరరావు, బాపినీడు, బొంబాయి మేయరు మేహరాలీ, బి.జి. ఖేర్, మణి బేహపటేల్, నగిందాసు మాష్టారు.

సత్యమూర్తి, పళ్లంరాజు, లింగరాజు, వినోబాభావే, కేళప్పన్, అనంత శయనం అయ్యంగార్, దండునారాయణరాజు మున్నగు నాయకులను పలుచోట్ల నిర్బంధించిరి.

దేశంలో 14చోట్ల తుపాకి కాల్పుల జరిగి, 57 మంది దెబ్బలు తిన్నారు; 59 మంది చనిపోయారు.

నెల్లూరులో : ఓరుగంటి వెంకట సుబ్బయ్య గారిని 9తేది గండవరంలో అరెస్టు చేసిరి. అ.భా.కాం. సభ్యులగు గోపాలురెడ్డి, వంగల్లు కోదండరామిరెడ్డి గారలు బొంబాయి నుండి 10తేది రాత్రివచ్చిరి. వెన్నెలకంటి రాఘవయ్య గారు బొంబాయి నుండి ఇంకా రాలేదు. వీరినింతవరకు అరెస్టు చేయలేదు. సుబోధిని పత్రికాధి పతి మన్నేపల్లి హనుమంతరావుగారిని 13 తేది రాత్రి 2 1/2 గంటలకున్ను, ముత్తరాజా గోపాలురావుగారిని 14తేది ఉదయం 6గంటలకున్ను నెల్లూరులో అరెస్టు చేసి లారీలో గూడూరుకు తీసుకపోయారు. అక్కడ నుండివేలూరు పంపుతారేమో. 13 తేది జరిగిన అల్లరుల సందర్భంలో అల్లరుకోటకునారాయణ, రాగాల వెంకట సుబ్బయ్య, రేపల్లె దేవ వీరాస్వామి, కురుగంటి వెంకటేశ్వర్లు, గడియారం రంగనాథ మొదలియార్ గార్లను అరెస్టు చేసారు.

### సంపాదకీయం

ప్రభుత్వ నిర్బంధములకు అసమ్మతి సూచకంగా, యిది మొదలు తిరుగా స్థితి గతులు చక్కబడు వరకు సంపాద కీయాలుండవు. పాఠకులు క్షమింతురుగాక.

- సంపాదకుడు

### రైళ్లు రావడంలేదు

12 తేదినుండి రైళ్ళు సరిగ్గానడవడంలేదు

పత్రికలవారికి ప్రభుత్వం

నిర్ణయించిన బిగింపులు

అఖిల భారత కాంగ్రెసు సంఘం ఆమోదించిన కొత్త ప్రజాఉద్యమానికి సంబంధించు ఏ వార్తలను గాని ప్రచురించే విషయంలో ప్రింటరూ, పబ్లిషరూ, ఎడిటరూ కొన్ని నియమాలను పాటించాలని డిఫెన్సు చట్టం క్రింద ఉత్తరువును కేంద్ర ప్రభుత్వం జారీ చేసింది.

## జనవాణి

# పొట్టి శ్రీరాములు స్మారకంగా పెద్ద విద్యాసంస్థనెలకొల్పండి

ద్విశతాబ్ది ఉత్సవాల సందర్భంగా నెల్లూరు జిల్లా పేరును పొట్టి శ్రీరాములు జిల్లాగా మార్చాలన్న ప్రతిపాదన సమంజసం కాదు. నెల్లూరు వైశ్య ప్రముఖులు మంచి మనసుతో తమకు తాముగా ప్రయత్నించి ఏదో ఒక పెద్ద విద్యా సంస్థను సాధించి దానికి ఆయన పేరు పెట్టడం బాగుంటుంది. లేకుంటే ఇప్పుడు నెలకొన బోతున్న మెడికల్, డెంటల్ కాలేజీలలో ఒక దానికి శ్రీరాములు గారి పేరు పెట్టినా ఉచితమే. ఆ రోజులలో వెంకటగిరి రాజాగారు ఏమి ఇచ్చారో, ఏ సహాయం చేశారోగాని వి ఆర్. కాలేజి రూపంలో ఆ రాజరికం పేరు శాశ్వతంగా నిల్చిపోయింది. దొడ్ల సుబ్బారెడ్డి గారి దాతృత్వంతో డి.కె.కాలేజి పేర కౌసల్యమ్మ గారి పేరు సార్థకమైంది. వైశ్య ప్రముఖులు ప్రయత్నించి నెల్లూరులో ఒక పిజి సెంటరో లేదా విశ్వవిద్యాలయమో నెలకొల్పి శ్రీరాములు గారి కీర్తిని అజరామరం చేయాలి!

-త్వరకవి

నెల్లూరు.

### డబ్బుతో చదువు సమాజానికి అరిష్టం

ప్రైవేటు మెడికల్ కాలేజీల పట్ల విద్యార్థులు, పలు ఇతర వర్గాల ప్రజలు వ్యతిరేకత చూపడం సమంజసమే. మనం విశ్వసించే, కాంగ్రెస్ ప్రభుత్వాలు ఆచరిస్తున్నామని చెప్పే గాంధియన్ సోషలిజానికి పూర్తి వ్యతిరేక చర్య ఇది. డబ్బుతో సీటు కొనుక్కొని చదివే వారికి సామాజిక బాధ్యత వుండదు. సీటు కొన్నట్లే వారు ప్రభుత్వ ఉద్యోగాన్నీ డబ్బుతో కొనుగోలు చేస్తారు. ఆ డబ్బుకై తాము ఆడపిల్లలకు అమ్ముడు బోతారు. కాలేజీలలోను డబ్బున్న వర్గం ఒకటి, లేని వర్గం ఒకటి తయారౌతుంది. విద్యార్థి దశలోనే అసమానతలు తలెత్తుతాయి. అసంతృప్తులకు దారితీస్తుంది. అది సాంఘిక వాతావరణాన్నే కలుషితం చేసి, సమాజానికి అరిష్టం కల్గిస్తుంది. కర్నాటకలో సీట్లు అమ్ముతున్నారని మనమూ అమ్మాలనడం పాలకుల హ్రస్వదృష్టిని సూచిస్తున్నది.

అసలు విద్యార్థులకు మెడికల్, ఇంజనీరింగ్‌లు తప్పవేరే విద్యలు లేవా? మారుతున్న వైజ్ఞానిక, ఆర్థిక పరిస్థితులకను గుణమైన పలు శాస్త్రాలు విద్యార్థులకు బోధించ వలసి వుంది. ఆయా రంగాలలో విశేషమైన కృషి, పరిశోధనా జరగవలసి వుంది. అటువంటి విభిన్నమైన శాస్త్రాలను ప్రవేశ పెట్టి కాలేజీలు తెరిచి బోధిస్తే దేశానికి ఉపయోగం. అందర్నీ డాక్టర్లుగా, ఇంజనీర్లుగా మారిస్తే, ఆ పట్టాలు చేత పట్టుకొని వారేమి చేయాలి! ఇప్పటికే రాష్ట్రంలో ఎందరో డాక్టర్లు, ఇంజనీర్లు నిరుద్యోగులుగా వున్నారు. వారికి పని కల్పించడానికి ప్రభుత్వం దగ్గర అస్పత్రులు, ప్రాజెక్టులు లేవు.

కొరవ 8 పేజీలో

### పత్రికా రచయిత కావాలి

'జమీన్‌రైతు'లో పనిజేయుటకు ఒక సహాయ సంపాదకుడు కావలెను. వార్తా సేకరణ, వ్యాఖ్యచేయ గలిగిన అనుభవం వున్నవారైతే మంచిది. అభిరుచి, శ్రద్ధాసక్తులు కలిగిన విద్యావంతులైన వారెవరైనా దరఖాస్తు చేసుకోవచ్చు. నెల్లూరు జిల్లా వాసికి ప్రాధాన్యత వుంటుంది. అర్హతను బట్టి మంచి వేతనం.

జమీన్‌రైతు, సంపాదకుడు,
నెల్లూరు- 524 001;
ఫోన్:27354.

## తిండియావ వదలి, వ్యక్తిత్వ వికాసం సాధించండి!

# ముస్లిం స్త్రీలను వంటింటికి పరిమితం చేయవద్దు!

నెల్లూరు జిల్లాలో చెప్పుకోదగిన తొలి ముస్లిం విద్యా సంస్థ ప్రారంభోత్సవం ముస్లింల జీవన సరళిపై చర్చావేదికగా మారింది. మొగ మాటాలుప్రక్కన పెట్టి; స్వేచ్ఛగా, సూక్ష్మంగా ముస్లింల జీవన రీతులపై వక్తలు తమ అభిప్రాయాలు ప్రకటించారు. ముస్లింలలో ఆధునిక నాగరికతా చైతన్యం తీసుకరావడానికి అవిరళ కృషి చేస్తున్న డాక్టర్ ముంతాజ్ అహమ్మద్ ఖాన్ ఈ సభలో పాల్గొనడం దీనికి కారణం కావచ్చు. 8తేది సాయంత్రం రంగనాయకుల పేటలో ప్రెస్టేజి జూనియర్ కాలేజిని ఆయన ప్రారంభించారు. జిల్లాలో ఇది మొట్టమొదటి మైనారిటీ విద్యా సంస్థ. కోస్తాంధ్రలో కూడా ఇదే ప్రథమం క్రింద లెక్క అట. సభను కర్ణాటక మైనారిటీస్ డెవలప్‌మెంట్ కార్పోరేషన్ మాజీ అధ్యక్షుడు శ్రీ జనాబ్ ఇబ్రహిం ఖలీలుల్లా ఖాన్ సాహెబ్ అధ్యక్షించారు. జి కాం అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి, ఎమ్మెల్యే శ్రీ జె.కె.రెడ్డి, మాజీ ఎమ్మెల్యే శ్రీకె.వి. సుబ్బారెడ్డి మాట్లాడారు. శ్రీ మహమ్మద్ హైదర్ అతిథులను సభకు పరిచయం చేశారు.

డాక్టర్ ముంతాజ్ అహమ్మద్ ముస్లిం ప్రజల సామాన్య జీవన శైలిలోని లోపాలను ప్రస్తావించారు. తిండియావ వదలు కొని, స్త్రీలను వంటింటికి పరిమితం చేయడం మానుకొని, సమాజంలో వారికి గౌరవ స్థానమివ్వాలని; వారి వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడాలని కోరారాయన. ముస్లింలు ఆభరణాల పట్ల, ధనరాశుల పట్ల ప్రాధాన్యత చూపకుండా, సామాజిక దృక్పథాన్ని అలవర్చుకోవాలని హితవు చెప్పారు.

ఖాద్రీ మసీదు వల్ల మనకు ఒరిగిందేమీలేదు; మనకు పేదరికం నుండి, అనారోగ్యం నుండి విమోచనం కల్పించే విద్యకోసం ముస్లింలు ఆత్రుత చూపాలి; బొంబాయి వంటి మహానగరాలలో దుర్భర దారిద్ర్యం తట్టుకోలేక వ్యభిచార వృత్తిలోకి దిగుతున్న ముస్లిం యువతుల విషయం ఆలోచించండి; వారిని ఆదుకోవడానికి ప్రయత్నించండి. అల్లా సమస్త మానవుల్ని సమానంగా సృష్టించాడనే విషయం గుర్తుంచుకుంటే మత విద్వేషాలకు తావు లేదు అన్నారాయన.

జె.కె.రెడ్డిగారు ఈ కాలేజి భవనానికి 25వేలు విరాళం ప్రకటించారు; శ్రీ హైదర్ తన భూరి భవనాన్ని, విశాల స్థలాన్ని ఈ విద్యా సంస్థకు దానమిచ్చారు. మాజీ ఎమ్పీ శ్రీ గౌసమొహిద్దీన్ వందనాలు చెప్పారు.

## సింహపురి

## పోస్టల్ ఉద్యోగుల జీతాల సమ్మె

పోస్టల్ డిపార్ట్ మెంట్ 3,4 తరగతుల ఉద్యోగులు 31తేది జీతాలు తీసుకోకుండా సమ్మె చేశారు. ఐఎన్‌టియుసి అనుబంధమైన నేషనల్ యూనియన్ ఆఫ్ పోస్టల్ ఎంప్లాయిస్ సంఘ సభ్యులు ఈ సమ్మె జరిపారు. సంఘ నాయకులు శ్రీ ఎ.శివరామారావు, కె. వెంకటయ్య, శ్రీఎన్.శరత్‌బాబు దీనికి నాయకత్వం వహించారు.

## 'రవీంద్రుని కథలూ గీతాంజలికి తీసిపోవు'

విశ్వకవి రవీంద్రనాథ ఠాగూర్ 51 వర్ధంతి సభ 8 తేది సాయంత్రం టౌన్ హాల్‌లో జరిగింది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షించారు. ప్రముఖ రచయిత శ్రీ పోలాప్రగడ సత్యనారాయణ రవీంద్రుని కథా విధానంపై ప్రసంగించారు. సత్యనారాయణ గారు మంచి కథకుడు. ఆయన రచించిన 'కౌసల్య' అనే నవల 14 భాషల్లోకి తర్జుమా అయింది. టివిలోనూ ప్రసారం కానున్నది.

రవీంద్రుని కథలు, గీతాంజలికి ఏమాత్రం తీసిపోవని చెప్పారు శ్రీ సత్యనారాయణ. కాబూలీ వాలా,

కొరవ 8 పేజిలో

## బహిరంగవేలము

కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని వస్తువులు

1) ప్రకాశ్ అండ్ కో పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నెం. 99, 8-1-50, బజారువీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచి నప్పటికి 25.10.90 నుండి 5.4.91 తేది వరకు గల విడిపించని వస్తువులు 29.8.92 తేది వుదయం 10 గంటల నుండి 8.1.50 బజారువీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

2) శ్రీ లక్ష్మిపాన్ బ్రోకర్స్ పి.బి.యల్. 11/85-86, 10/559 సంతపేట, నెల్లూరు వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 26.10.88 నుండి 5.11.90 తేది వరకు గలవిడిపించని వస్తువులు 4.9.92 తేది వుదయం 10 గంటల నుండి 10/559 సంతపేట, నెల్లూరులో బహిరంగముగా వేలము జరుపబడును.

3) టి. కన్హయాలాల్‌జైన్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం. 108, 1/57, పోస్టాఫీసు వీధి, రేణిగుంట వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.3.91 నుండి 16.7.91 తేది వరకు గల విడిపించని వస్తువులు 5.9.92 తేది వుదయం 10 గంటల నుండి 1/57 పోస్టాఫీసు వీధి రేణిగుంటలో బహిరంగముగా వేలము జరుపబడును.

4) జి. దోకల్ రామ్ పటేల్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం. 173, 13-1-22ఎ పెద్దకాపు వీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 5.8.91 నుండి 31.8.91 తేది వరకు గల విడిపించని వస్తువులు 21.9.92 తేది వుదయం 10 గంటల నుండి 13.1.22 ఎ పెద్దకాపు వీధి తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

కె.వి. రామకృష్ణరావు
ప్రభుత్వము నియమించిన వేలముదారు
11/268, సంతపేట, నెల్లూరు.

## సణుగుడు

* 'క్విట్ ఇండియా' కాదు, 'కమ్ ఇండియా'
* ఒలింపిక్స్‌లో రిజర్వేషన్లు పెట్టాలి!

గాంధీగారు బ్రిటిషు వాళ్ళను 'క్విట్ఇండియా' అని గద్దించడానికి కారణమేమై వుంటుందంటావు?

స్వాతంత్ర్యం వచ్చిన ఇన్నేళ్ళ తర్వాత ఇదేమి పిచ్చి ప్రశ్న, అసలు నీకా అనుమానం ఇప్పుడెందుకొచ్చింది?

క్విట్ ఇండియా స్వర్ణోత్సవాలను టి.వి.లో చూసివుంటే నేను వేసింది పిచ్చి ప్రశ్నో, గాంధీ గారు చేసింది పిచ్చిపనో నీకు అర్థమై వుండేది.

నీ ఉద్దేశ్యమేమిటసలు?

ముందు నేనడిగిన దానికి సమాధానం చెప్పు- క్విట్ ఇండియా అని ఆనాడాయన పిలుపెందుకు పెట్టారు?

బ్రిటిషు వాళ్ల చేతిలో భారతీయులు నలిగిపోతున్న తీరు చూడలేక; పరాయి పాలకుల చెరలో భరత మాత అనుభవిస్తున్న దాస్య జీవితం భరించలేక!

పరాయి పాలకులంటే ఒప్పుకుంటానుగాని, బ్రిటిషు వాళ్ళచేతిలో భారతీయులు పడిన బాధలేమిటి?

మన సంపదనంతా వారు దోచుకొని ఇంగ్లండుకు తరలించక పోయ్యేవారు; మనల్ని మన దేశంలోనే రెండవ తరగతి పౌరులుగా చూసేవారు; మన దేశంలో అభివృద్ధి అంటూ జరగకుండా చూసేవారు; మన జనం ఆకలి కేకలు పెట్టుంటే గంజి కేంద్రాలు తెరిచి దివ్యం చేసినట్లు గంజిపోయడం తప్ప, శాశ్వతంగా ఆకలి తీరే మార్గం చస్తే కనిపెట్టేవారు కారు; మనకు స్వేచ్ఛ లేకుండా చేసేవారు; మనవాళ్ళు డాక్టర్లో, ఇంజనీర్లో కావాలనుకుంటే ఇంగ్లండుకు పోవాల్సిందే తప్ప, స్వదేశంలో అవకాశాలు లేకుండా చూసేవారు; చెరువులు, కాలువలు త్రవ్వించక రైతులను ఏడ్పించే వారు; పన్నుల పై పన్నులు వేసి జనాన్ని పీల్చి పిప్పి చేసేవారు; ఇట్లా పిండిన సొత్తు నంతటినీ ఇంగ్లండుకు తరలించి తాము మాత్రం లండన్‌లో రాజ ప్రాసాదాలు కట్టుకునేవారు. ఇంత ఘోరానికి తలపడుతున్న దుష్టపాలకులను 'క్విట్ఇండియా' అనక ఏమంటారు?

ఈ చిన్నచిన్న తప్పులు చేసినందు కేనా, బ్రిటిషు వారిని దేశం

కొరవ 8 పేజిలో

## డోలేంద్ర

## ఆనాటి సామాజిక సమస్యకు సమగ్ర చిత్రం – ఈనాటికీ గుభాళిస్తున్న సాహితీ సుమ సౌరభం!

# కన్యాశుల్కం

ఆంధ్రనాటక రంగంలోని అనర్ఘ రత్నాలన దగిన బహుకొద్ది నాటకాలలో కన్యాశుల్కం ప్రముఖస్థానాన్ని పొందింది. ఆ నాటకం వెలుగులోని కొచ్చి వంద సంవత్సరాలైనా ఇంకా నిత్యనూతనంగా, నవ యవ్వనంగా వెలుగు తోందంటే ఆ నాటిక బహుముఖ ప్రజ్ఞాపాటవాలు మనకు గోచరమవుతాయి. 'కన్యాశుల్కం' నాటక రచన అంతకు ముందే జరిగినా, ప్రథమంగా 1892 ఆగస్టు నెల 13 వ తేదీ జగన్నాటక విలాసినీ నాటక సమాజం వారిచే ప్రదర్శింపబడింది. కాని ప్రచురణకు మాత్రం 1897 జనవరి 1 వ తేదీ వరకు నోచుకోలేదు. ఇంత పేరుప్రఖ్యాతులు గలిగిన నాటకం మన తెలుగు వారి స్వంతం కావడం మనకు గర్వకారణం.

ప్రథమ సాంఘిక నాటక ప్రణేతగా పేరొందిన గురజాడ వారు రచించిన ఈ నాటకానికి స్ఫూర్తినిచ్చిన ఆనాటి సాంఘిక పరిస్థితులను చూస్తే, ఆ మహానుభావుడు కన్యాశుల్కాన్ని రచించి, సంఘ సంస్కరణాభిలాషకు ఎంతటి ఉత్తేజాన్ని కల్గించారో, ఎంత సాహసం ప్రదర్శించారో అవగతమౌతుంది. ఆ రోజుల్లో ఘోర విపత్కర పరిస్థితులు సంఘంలో నెలకొని వుండేవి. కన్యాశుల్క ప్రధానంగా బాల్య వివాహాలు సర్వసాధారణం. ఆడపిల్లల తండ్రులు శుల్కానికి ఆశపడి, పసికందులయిన తమ బిడ్డలను మూడు కాళ్ల ముదుసలులకూ, కాటికి కాళ్లు చాచుకున్న వృద్ధులకూ అమ్ముతుండే వారు. దురదృష్టవశాత్తూ ఆ వృద్ధుడు 'హరీ' అంటే, ఇంక ఆ బాలిక బ్రతుకు బుగ్గిపాలై నట్లె లెక్క. జీవితంలో వాంఛల్ని చంపుకొని, నిస్సారమైన శేష జీవితం గడపవలసిన దుర్గతి పట్టేది. బాల్య వివాహాల నిరసన, వితంతు వివాహ ప్రోత్సాహం వంటి సంస్కరణలకు పాటుపడ్డ వీరేశలింగం పంతులు గారు గురజాడ వారికి గురుతుల్యులు. కన్యాశుల్క నిర్మూలనకై గురజాడ వారు ఈనాటకాన్ని రచించారు. ఈ రచనకు కారణభూతులై అందరందరగా నిలిచిన వారు ఆనంద గజపతి మహారాజా. ఆ విషయాన్ని నాటిక పీఠికలోనే వివరించారు గురజాడ వారు.

### నూరేళ్ల సజీవ నాటక స్మరణ

* * *

ఐ వి రఘురామమూర్తి

"Under the orders of His Highness the Maharaja of Vizianagaram, a list was prepared ten years ago of Brahmin Sulka marriages celebrated in the ordinary tracts of Visakhapatnam District during three years. The number of marriages recorded reached one thousand and thirty four, giving an average of three hundred forty four for the year. Ninety nine girls

కొరవ 11 పేజిలో




ఆగస్ట్ 7, 1992 ఉదయం మా నూతన భవన ప్రవేశోత్సవానికి విచ్చేసి, ఆశీస్సులందజేసిన వారందరికీ మా హృదయపూర్వక వందనాలు!



ఆధునిక నెల్లూరు ఆడపడుచుల అభిరుచులను ప్రతిబింబించే వస్త్ర నిలయం

# రాయవరపు శిల్క్స్ & శారీస్

కార్నర్‌షాప్ (రాయవరపు సెంటర్) ట్రంకురోడ్డు - కాపువీధి నెల్లూరు - 1

## ఫ్యాన్సీ చీరల ప్రత్యేక ఎయిర్ కండిషన్డ్ షోరూం

కోయంబత్తూరు, బెంగాల్ కాటన్, గార్డెన్, స్మూత్ సిల్క్ ప్రింట్ వంటి వన్నెలు చిందే ఫ్యాన్సీ చీరలకు ఈ రోజే విచ్చేయండి!



### 1992 డైమండ్ జూబిలి సంవత్సరం

నెల్లూరు వస్త్ర వ్యాపారంలో వినూత్న అధ్యాయానికి ఆరు దశాబ్దాల క్రితం రాయవరపు శంకరయ్య గారు నాంది పలికారు. పట్టణ మహిళలకు వస్త్ర ప్రపంచంలోని ఫ్యాషన్లు తెలియని రోజుల్లో ఆయన 1932లో రామకృష్ణా మిల్స్ స్వదేశీ స్టోర్సు పేరిట వస్త్ర దుకాణాన్ని ప్రారంభించారు. ఆ దుకాణమే శ్రీ రాయవరపు శంకరయ్య అండ్ సన్సు పేర ప్రఖ్యాతి గాంచింది. 1972 నుంచి శంకరయ్య కుమారుడు శ్రీ బదరీ నారాయణ నేతృత్వంలో కొనసాగుతోంది. 1985 లో మహిళల మనోభావాలకు అద్దం పట్టేలా ప్రారంభించిన **రాయవరపు శిల్క్స్ & శారీస్** మీ ఆదరణతో పురోభివృద్ధి చెందుతోంది. మారుతున్న కాలానికి అనుగుణంగా మారిపోతున్న అభిరుచులను బట్టి అధునాతన వస్త్ర రకాలను మీ కందుబాటులో ఉంచుతూ మీ ఆదరణను మరింతగా చూరగొనాలని ఆకాంక్షిస్తున్నాము.

నూతన భవన ప్రారంభకులు

శ్రీ ఆనం వివేకానంద రెడ్డి

జ్యోతి ప్రజ్వలన చేసిన

శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి

గార్లకు మా ప్రత్యేక వందనం!

రాయవరపు బదరీ నారాయణ - రాయవరపు బాలగోపాల్

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## ముఖ్యమంత్రి సుడిగాలి పర్యటన

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి 16 తేది ఉదయం నెల్లూరు వస్తున్నారు. ఆ రోజంతా సుడిగాలి పర్యటనే. ఉదయం రాపూరు, చింతవరం, పొదలకూరు; మధ్యాహ్నం జగదేవిపేటలో జకెరెడ్డి కట్టించిన వెటర్నరీ ఆస్పత్రి భవనం ప్రారంభం నెల్లూరులో వేణుగోపాలస్వామి కాలేజి భవన శంకుస్థాపన, డిఆర్‌డిఎ భవనాల రిబ్బను కత్తిరింపు, ద్విశతాబ్ది సమావేశం, జస్టిస్ అన్సారీ సంస్మరణ సభ, ఆనం సంజీవరెడ్డి వివాహ వేడుక; హెలికాప్టర్ దుమ్ము జిల్లాలోనే కాకుండా, నెల్లూరు టౌన్ వీధుల్లోనూ రేగుతుంది.

17 తేది వెంకటగిరి; ఆ రోజంతా తిరుపతి కార్యక్రమాలు; రాత్రికి హెలికాప్టర్‌లో మద్రాసు పయనం.

## ద్విశతాబ్ది ఉత్సవాలు మూడు రోజులు

జిల్లా ద్విశతాబ్ది వుత్సవ కమిటీ రెండవ సమావేశం 11 తేది జి.ప్ర.ప హాలులో జరిగింది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు అధ్యక్షత వహించారు. కలెక్టరు శ్రీ కె.రాజా సభా కార్యక్రమాన్ని నిర్వహించారు.

ఉత్సవాలు డిసెంబరు మూడవ వారంలో మూడు రోజుల పాటు జరపాలని నిర్ణయించ బడింది. చర్చి ప్రాంగణం వుత్సవాలకు అనువైన ప్రదేశం అనుకున్నారు. ఆరు సబ్ కమిటీలకు అనధికార అధ్యక్షులకు తోడు కన్వీనర్లుగా అధికార్లు నియమింపబడ్డారు. సావనీర్ కమిటీ – డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షులు, శ్రీమతి ఉదయలక్ష్మి కన్వీనరు; సన్మానాల కమిటీ- కె. విష్ణువర్ధన రెడ్డి అధ్యక్షులు; ఎగ్జిబిషన్ కమిటీ -ఎన్. ఎస్. కృష్ణమూర్తి అధ్యక్షులు, సతీష్‌చంద్ర కన్వీనరు; ఫైనాన్స్ మాగుంట సుబ్బరామరెడ్డి అధ్యక్షుడు, బి. సత్యనారాయణ కన్వీనరు; నిర్వహణ – జె.కె. రెడ్డి అధ్యక్షుడు, పునీత కన్వీనరు; అభివృద్ధి ప్రణాళికా కమిటీ – డాక్టర్ బి. సుందరరామరెడ్డి అధ్యక్షుడు, బి. సుబ్రహ్మణ్యం కన్వీనరు. ఇక ముందు ఉపసంఘాలు తరచు సమావేశమై కార్యక్రమంలో నిమగ్నం కావాలని కలెక్టరు కోరారు.

ఉత్సవాల సందర్భంగా పెన్నా మీద బైపాస్ రోడ్డు రెండవ బ్రిడ్జికి, కృష్ణపట్నం సూపర్ థర్మల్ స్టేషన్‌కూ శంకుస్థాపనలు జరిపిస్తే బాగుంటుందని శ్రీరాజా వెలిబుచ్చారు. హాస్పిటల్ కాంపౌండ్‌లో ఏర్పాటు చేసే పురావస్తు ప్రదర్శనశాల, పార్కు ప్రాంగణంలో కవి బ్రహ్మ తిక్కన విగ్రహాన్ని ప్రతిష్ఠించాలనే సూచన కూడా ఆమోదించబడింది.

సమావేశంలో బి.జె.పి.కి చెందిన శ్రీ వరదయ్య నెల్లూరు చరిత్రను ఏకరవుపెట్టి, రెండువేల సంవత్సరాల చరిత్ర వుంటే రెండు వందలేమిటి అని ప్రశ్నించాడు. పరిపాలనా సంబంధంగా నెల్లూరు జిల్లా ఏర్పడి రెండు వందల సంవత్సరాలేనని కలెక్టరు చెప్పారు. హైదరాబాదు 400 ఏండ్లు, కలకత్తా 300 ఏండ్ల వుత్సవాలు జరుపుకోవడం వంటిదే ఇది కూడా అని రాజా గారు వివరించారు. కొందరుసభ్యులకు ఇది జిల్లా ద్విశతాబ్ది వుత్సవానికి వుద్దేశించిన కమిటీ సమావేశమనే స్పృహే వున్నట్లు లేదు. నార్లకు ఇంకా నీరు వదలలేదనడం మొదలు, బంజరు భూముల పంపకాల వరకు అన్ని సమస్యలూ ప్రస్తావనకు తేవడం అసందర్భము, అప్రస్తుతము అనిపించింది.

ఈ వుత్సవాలకు, వివిధ అంశాలకు నిధుల కేటాయింపు ఎంతో తెలిస్తే గాని, వివరాలు నిర్ధారణ కావు. 16 తేది సాయంత్రం జరిగే సమావేశంలో ముఖ్యమంత్రి జనార్దన రెడ్డి గారు ఏమేమి ప్రకటిస్తారో చూద్దాం!

## కృష్ణపట్నానికి రైలు

నెల్లూరు – కృష్ణపట్నం రైలు మార్గానికి ప్రాథమిక సర్వే జరుగుతున్నట్లుంది. వివరాలు విచారించి ప్రకటిస్తారు.

## క్విట్ ఇండియా సభ

9 తేది జిల్లా కాంగ్రెస్ సంఘం కోఆపరేటివ్ బ్యాంకి మిద్దె మీద క్విట్ ఇండియా స్వర్ణోత్సవాన్ని ముక్కు బదిగా జరిపింది. ఎవ్వరికీ తెలియ నందువల్లనేమో యాభైమంది వరకు ప్రజానీకం హాజరైనట్లున్నారు. శ్రీ ఆనం సంజీవరెడ్డి రెడ్డి అధ్యక్షత; శ్రీ పెద్ది సుబ్బరామిరెడ్డి పతాకావిష్కరణ; డాక్టర్ గోపాలరెడ్డి, ఆర్. దేవదానం, ఆంథోని ప్రభృతుల ప్రసంగాలు, సన్మానాలు కూడా వుండినాయి.

వేడుకగా జరుపవలసిన కార్యక్రమం కాదా ఇది?

## మునిసిపల్ పన్నుల తగ్గింపు

నెల్లూరు మునిసిపాలిటీలో ఐదారు రెట్లు అదనంగా, అన్యాయంగా పెంచిన పన్నుల భారాన్ని తగ్గించడానికి మునిసిపల్ మంత్రి శ్రీ నరసింహారెడ్డి అంగీకరించారు. తిరుపతిలో తనను కలిసిన అఖిలపక్షం ప్రతినిధి బృందానికి ఆయనీమేరకు హామి ఇచ్చారు. పన్ను పెంపు వందశాతానికి మించకుండా చూస్తామని చెప్పారట.

ఇళ్ల పన్నుల విషయంలో ఇటువంటి ఉత్తుత్తి హామీల వల్ల ప్రయోజనం లేదు. పన్నుల విధానాన్ని చట్టపరంగా పునఃపరిశీలన చేసి; జోన్ల నిర్ణయం, పన్నుల శాతాన్ని పునర్వ్యవస్థీకరిస్తే తప్ప ఇళ్ల యాజమానులకు న్యాయం జరగదు. మంత్రి వాగ్దానాలకు భ్రమసి ఆందోళన విరమిస్తే అన్యాయమై పోతాం!

## డిఎస్‌పి రిలీవ్

నెల్లూరు డిఎస్‌పి శ్రీ మురళి, బాధ్యతల నుంచి రిలీవ్ అయ్యారు. ఆయన స్థానంలో కోటిరెడ్డి అనే డిఎస్‌పి నియమితుడై నట్లున్నారు; ఇంకా వచ్చి చార్జి తీసుకోలేదు.

## ఇళ్ల పన్నుల ధర్నా

పెంచిన ఇళ్లపన్నులకు నిరసనగా మాజీ మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ సందాని ఆధ్వర్యంలో మునిసిపలాఫీసు ఎదురుగా ధర్నా జరిగింది.

## మెడికల్ కాలేజిలు

(మొదటి పేజీ కొరవ)

దాఖలు చేయడం పెద్ద రాజకీయ వివాదాన్ని ప్రేరేపిస్తున్నది. అసెంబ్లీలో ఈ విషయం ప్రస్తావనకు తెచ్చి, నిలదీయాలని ప్రతిపక్షాలు ప్రయత్నిస్తున్నాయి.

జనార్దనరెడ్డి అవిధంగా ఎందుకు ప్రకటన చేయవలసి వచ్చిందో ఆశ్చర్యం. విద్యానగర్ తాను నెలకొల్పిన ఇంజనీరింగు కాలేజి రాష్ట్రంలో ఒక వుత్తమమైన కాలేజిగా పేరు తెచ్చుకున్నది. అటువంటప్పుడు రేపు నెల్లూరులో పెట్టబోయే మెడికల్ కాలేజి సైతం వున్నత ప్రమాణాలతో నిర్వహింప బడగలదని ఆత్మస్థైర్యంతో ఆయన చెప్పి వుండవచ్చు.

## పంచాంగము

### ఆగస్టు తిథులు

శ్రావణ బహుళ

| | | |
|---|---|---|
| తే 15 | శని విదియ సా.గ. | 6.20వ |
| తే 16 | ఆది తదియ రా.గ. | 8.05వ |
| తే 17 | సోమ చతుర్థి రా.గ. | 10.05వ |
| తే 18 | మంగళ చతుర్థి రా.గ. | 10.25వ |
| తే 19 | బుధ షష్టి రా.గ. | 10.50వ |
| తే 20 | గురు సప్తమి రా.గ. | 10.45 వ |
| తే 21 | శుక్ర అష్టమి రా.గ. | 10.10వ |

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ



## సవరణ

7-8-92 జమీన్‌రైతు 8 పేజీ మొదటివారం పన్నపురెడ్డి వెంకట రెడ్డి గారి ప్రకటనలో రాపూరు వెంకట కృష్ణారెడ్డి కుమారుడు బదులు రాపూరు వెంకట శేషారెడ్డి గారి కుమారుడు అని సవరించుకోమని మనవి.

– మేనేజరు – జమీన్‌రైతు



## పడుగుపాడు గ్రామ పంచాయితీ

### టెండరు నోటీసు

ఆర్.ఒ.సి నెం. 36/92 తేది: 11-8-92

నెల్లూరు జిల్లా కోవూరు మండలం పడుగుపాడు గ్రామ పంచాయితీలో ఈ క్రింది వస్తువుల సరఫరా మరియు పనులు చేయుటకు గాను సీల్డు టెండర్లు కార్యనిర్వహణాధికారి గారిచే లేక వారి అనుమతి పొందిన వారిచే గాని 26.8.92 తేది బుధవారం మధ్యాహ్నం 3 గంటల వరకు తీసుకొనబడి, 3-30 గంటలకు హాజరు కాబడిన టెండరు దారుల సమక్షమున సదరు టెండర్లు తెరువబడును. టెండరు దాఖలు చేయగోరు వారు ఆయా ఐటములకు ఎదురుగా నిర్ణయించిన ధరావత్తు చెల్లించి రశీదు పొంద వలెను. ధరావత్తు చెల్లించిన రశీదును జతపరచిన టెండర్లు పరిగణనకు తీసుకొనబడవు. పనులు చేయుటకు పంచాయితీ రిజిష్టరు కంట్రాక్టర్లు మాత్రమే పాల్గొనవలయును మిగిలిన వివరములు ఆఫీసు పని దినమున పనివేళలందు వచ్చి తెలిసి కొనవచ్చును.

| వ.నెం. | వివరములు | ఎస్టిమేటు | ధరావత్తు |
|---|---|---|---|
| I. | వస్తువులు సరఫరా : | | |
| 1. | 1992-93 సంవత్సరమునకు వీధిలైట్ల సామగ్రి సరఫరా చేయుట (శ్రీ జిల్లా కలెక్టరు (పం.వి) నెల్లూరు వారి ఉత్తర్వుల ప్రకారం అనుమతి పొందిన రేటు కాంట్రాక్టు రేట్లకు లోబడి సరఫరా చేయవలయును. (ఆథరైజుడు కంపెనీల అధిక రేట్లకు లోబడి టెండర్లు వేయవలయును) | | 500/- |
| II. | పనులు చేయుట : | | |
| 1. | పెద్దపడుగుపాడు మెయిన్ రోడ్డు నుంచి బావి ప్రక్కన దాసరి వెంకట కృష్ణయ్య ఇంటి వరకు "గ్రావెల్ రోడ్డు" వేయుట | 750/- | 38/- |
| 2. | చిన్నపడుగుపాడు సత్యవతి నగర్‌లో వెలిశెట్టి చెన్నయ్య ఇంటి నుండి జి.ఎన్.టి. రోడ్డు వరకు "మెటల్ రోడ్డు" వేయుట | 15,000/- | 750/- |
| 3. | పెద్దపడుగుపాడులో గుండవరపు రంగారెడ్డి ఇంటి నుండి విన్నకోట వారి వీధి వరకు "సిమెంటురోడ్డు" వేయుట | 18,000/- | 900/- |
| 4. | సరస్వతి నగర్ పి.హెచ్. సుందర రామిరెడ్డి ఇంటి నుండి వి. నారాయణ ఇంటి వరకు "మెటల్ రోడ్డు" వేయుట | 7000/- | 350/- |
| 5. | సరస్వతి నగర్‌లో ఎన్. పట్టాభిరామయ్య ఇంటి నుండి దేవరం కృష్ణారెడ్డి ఇంటి వరకు "మెటల్ రోడ్డు" వేయుట | 13,500/- | 675/- |
| 6. | చిన్నపడుగుపాడు బ్రాంచి రోడ్డు నుండి ఆనందరావ్ హాస్టలు వరకు వున్న "తారు రోడ్డు రిపేరు చేసి మరలా తారు రోడ్డు" వేయుట | 16,600/- | 830/- |
| 7. | చిన్నపడుగుపాడులో షేక్ బాషా మొహిదీన్ ఇంటి నుండి పడుగు పాడు ఆదెమ్మ ఇంటి వరకు "సిమెంటు రోడ్డు" వేయుట | 17,500/- | 875/- |
| 8. | చిన్నపడుగుపాడులోవరాలశెట్టి రఘురామయ్య ఇంటి నుండి వల్లెపు రమణయ్య ఇంటి వరకు "మెటల్ రోడ్డు" వేయుట | 20,000/- | 1000/- |
| 9. | పెద్దపడుగుపాడులో భట్టుమస్తానయ్య ఇంటి నుండి రహీమ్ ఇంటి మీదుగా మసీదు వద్ద మెయిన్ రోడ్డు వరకు తారు రోడ్డు రిపేరు చేసి మరలా "తారు రోడ్డు" వేయుట | 20,000/- | 1000/- |
| 10. | గుడుంపా వలి దర్గా ప్రాంతములో నివసించు గిరిజనుల ఇండ్ల వద్ద "గొట్టపు బావి" వేయుట | 2,200/- | 110/- |

బి. ఆదిశేషయ్య
కార్యనిర్వాహణాధికారి

# శ్రీ వేణుగోపాలస్వామి సైన్స్ అండ్ ఆర్ట్స్ కాలేజి

ఆనం వెంకన్న నగర్ ( ఏసి నగర్ సమీపం ) నెల్లూరు.



నూతన భవన సముదాయం శంకుస్థాపన మహోత్సవంలో



నెల్లూరు జిల్లా కీర్తిని జాతీయ స్థాయికి
పెంచిన నాయకుడు, విద్యాభిమాని,
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

## శ్రీ ఎన్. జనార్దన రెడ్డి గారికి

## సుస్వాగతం



కళాశాల కరస్పాండెంట్, ఇంత భారీ భవన
నిర్మాణాన్ని తానుఒక్కడే సంకల్పించి
నిర్మిస్తున్న కార్యదక్షుడు, మా మిత్రుడు

## శ్రీ ఆనం వివేకానంద రెడ్డి కి

## శుభాకాంక్షలు

స్వామి అయ్యప్ప కృపాకటాక్ష
వీక్షణాల పై ఇద్దరి పై
ప్రసరించాలని ఆకాంక్షిస్తున్నాము.

ఎం.ఎస్. పరమేశ్వరన్ (రాజు)
ఛైర్మన్
స్వామి అయ్యప్ప సేవా సమాజము
నెల్లూరు.

## సఖుగుడు

(4 పేజీ కొరవ)

మంచి తినిపించేసెందుకు గాంధీగారు అర్ధ శతాబ్ది పాటు భారతీయులను వీధుల్లో త్రిప్పింది? ఉద్యమాలు నడిపింది? పెళ్లాం పిల్లలను, ఆస్తులు ఐశ్వర్యాలను వదిలి జైళ్లలో మగ్గమని ఆదేశించింది? పోలీసుల తుపాకులకు ఎదురునిలబడి చావమన్నది! తామూ జైళ్లలో మగ్గి, అన్నం నీళ్లు మాని, క్రుంగి కృశించి పోయింది?

బ్రిటీషు వాళ్లు చేసినవి చిన్న తప్పులా?

అప్పట్లో అవి పెద్ద తప్పులుగా కన్పించాయేమోగాని, ఇప్పుడు మాత్రం కావు; గాంధీగారు ఇప్పుడు బ్రతికి వుంటే, 'కమ్ ఇండియా' అని బ్రిటీషు వాళ్లను బిధిరించి వుండేవారు.

చెప్పదలుచుకున్న దేదో నేరుగా చెప్పరాదా? ఈ వంక తిరుగుళ్లెందుకు?

ఇందులో అర్థం కానిదేముంది? ఏ తప్పులు చేస్తున్నారని బ్రిటీషు వాళ్లను మనం మెడపట్టి బయటకు గెంటామో, ఇప్పుడవే పరిస్థితులను మనకు మనమే కల్పించు కుంటున్నాం. అప్పుడు జాతీయ సంపద ఇంగ్లండు రాణి బొక్కసానికి చేరితే, ఇప్పటి జాతీయ సంపద హర్షద్‌మెహతా ఇంటికి, కేంద్ర,రాష్ట్ర మంత్రులు, ముఖ్యమంత్రుల జేబుల్లోకి చేరుతూంది; అప్పుడు బ్రిటీషువాడు మనల్ని రెండవ తరగతి పౌరులుగా చూస్తే ఇప్పుడు ప్రతి పొలిటీషియను, ప్రభుత్వాధికారీ సగటు జనాన్నిఅంతకంటే హీనంగా కించపరుస్తున్నారు; అభివృద్ధి అప్పుడూ లేదు, ఇప్పుడూ లేదు; ఆకలి కేకలు అప్పుడూ వున్నాయి, ఇప్పుడూ వున్నాయి; ఆనాడు గంజి పోస్తే ఈనాటి ప్రభుత్వాలు సబ్సిడి బియ్యాన్ని బిచ్చంగా వేస్తున్నాయి; అప్పుడు డాక్టర్ కావాలంటే వేలు ఖర్చు పెట్టి ఇంగ్లాండుకు పోవాల్సి వస్తే, ఇప్పుడు డాక్టరు కావడానికి లక్షలు ధారా పోసి సీటు కొనుక్కోవాలి. వెత్తిన ఆనాడు ఈనాడు కూడా ఒకే రీతిన పోలీసు లాఠీ, ప్రభుత్వాధికారి కలం పెత్తనం చేస్తూనే వున్నాయి; చెరువులు, కాలువలు త్రవ్వేవారు లేక రైతులు ఈనాటికీ ఏడుస్తూనే వున్నారు; పన్నుల భారం మోయలేక అప్పటి జనమూ కృంగిపోతున్నారు. పన్నుల సొత్తు ఆనాడు లండన్‌లో రాజప్రాసాదాలు నిర్మిస్తే, ఇప్పటి పన్నుల సొమ్ము సారాయి వ్యాపారులు, కంట్రాక్టర్ల సౌధాల నిర్మాణానికి ఉపకరిస్తున్నది. ఇక బ్రిటీషు వాళ్లు చేసిన తప్పేమిటి? మనం చేస్తున్న ఒప్పేమిటి? వాళ్లే నయం -ప్రజలకంటూ కేటాయించిన పది పైసలనైనా తాము తినకుండా ప్రజలకే ఖర్చు పెట్టేవారు; ఇప్పుడు పది రూపాయల కేటాయిస్తే ప్రజలకు పది పైసలు చెందకుండా జాగ్రత్త పడుతున్నాం; కట్టిన ఒకటి రెండు ప్రాజెక్టులైనా కూలిపోకుండా పదికాలాల పాటు వుండేటట్లు కట్టేవారు; ఇప్పుడు పది కట్టినా, వాటి నీళ్లు కొనదాకా పారక ముందే పేకమేడలవలె కూలిపోతున్నాయి; ఆ రోజుల్లో పోలీసు స్టేషన్ కు వెళ్తే, నేరస్తుల వీపు విరిగినా, సాధారణ జనానికి ప్రమాదం వుండేది కాదు; జాతిద్రోహిగా ముద్ర వేసి జైలుకు పంపినా, ఉద్యమకారులను మర్యాదగానే చూసేవారు. ఇప్పుడు సంసార స్త్రీ రక్షణ కోసం పోలీస్ స్టేషన్‌కి వెళ్తే, చెరచబడి, ఉరిపోసుకుని శవంగా మిగుల్తున్నది; అప్పుడు ప్రభుత్వాధికారులు జీతం తిని బ్రతికేవారు- ఇప్పటి ప్రభుత్వనేతలు ప్రజల రక్తమాంసాలు పీల్చి బొజ్జలు పెంచుకుంటున్నారు. ఇవన్నీ చూస్తే గాంధీగారు తాను చేసిన తప్పుకు చెంపలేసుకొని, లండన్‌కు వెళ్లి మీ పరిపాలనలోనే నా ప్రజలు సుఖంగా బ్రతుకుతారు తెల్లదొరా అని ఒప్పుకొని 'కమ్ ఇండియా' అని బ్రిటీషు వాళ్లను మన్నబతమలాడేవారు. కాదంటావా?

ఇటువంటి ప్రశ్నలు వేసి నన్నెందుకు ఇరకాటంలో పెడతావు- ఏదో గుట్టుగా బ్రతుకుతున్న వాడ్ని; వదిలేయ్!

ఢిల్లీలో గాంధీగారి సమాధి వుందట- అక్కడకు వెళ్లివి చెట్టు క్రిందో కూర్చుని, ఈ సొదంతా గాలికి విన్పించు; గాంధీగారి ఆత్మ ఆ ప్రాంతంలో ఎక్కడైనా తిరుగుతుంటే విని సంతోషిస్తుంది- లేదా కుమిలి పోతుంది.

* * *

బార్సిలోనా నుంచి తిరిగి వచ్చే భారత క్రీడాకారులకు సులక మంచం, పసుపు, కుంకుమ, ఎర్రగాజాలు పెట్టి బహూకరించాలని వుంది; విమానా శ్రయం దాకా నన్ను వెళ్ళనిస్తారా?

ఖర్గ తిక్కన సతీమణి ఫోజాలు కొట్టబోకు - సెక్యూరిటీ పోలీసులు కాల్చి పారేస్తారు.

బార్సిలోనాను మరీ అంత ఫార్స్ -లోనా గా మార్చిన ప్రబుద్ధులకు బుద్ధి వచ్చేట్లు చేయబల్లేరా? భారతదేశం పరువును అంత ఘోరంగా గంగపాలు చేసిన వారిని ఊరకే వదలి పెట్టాలా?

పాపం మన ఆటగాళ్ల తప్పేమి వుంది? ఒలింపిక్ అసోసియేషన్‌దే అసలు నేరం!

వాళ్లేమి చేశారు ?

అగ్రరాజ్యాల కుట్రకు లోబడి, ఇండియా వంటి పురాతన సంస్కృతి వైభవం కల్గిన దేశాలు నైపుణ్యం సంపాదించిన ఆటలను, తమ పోటీలలో చేర్చక పోవడం నేరం కాదా?

అవేమి స్పెషల్ స్పోర్ట్స్?

అవినీతిలో పోటీ పెట్టి వుంటే ఫస్ట్ ప్రైజ్ నిస్సందేహంగా మనదే అయివుండేది! అతి వాగుడుకు కంటెస్ట్ నిర్వహించి వుంటే కొమ్ములు తిరిగిన అమెరికాలు, రష్యాలు అట్టడుగున చతికిల పడి వుండేవి!

అవినీతితో పోటీ పెట్టేదెట్లా?

ఓస్, అదెంత పెద్ద పని! పతకాల కొనుగోళ్లలో ప్రక్కవాడికి తెలియకుండా కమీషన్ కొట్టేయడంలో నేర్పు ప్రదర్శించ మనవచ్చు; అసలు బంగారు పతకాలనే తారుమారు చేసి, ఇత్తడి బిళ్లలపై పూత పూసి, క్రీడాకారుల మెడలో అలంకరింపజేయడంలో నేర్పు నిపుణత చూపమంటే, ఫస్ట్ ర్యాంక్ మనదే అయివుండేది. ఆటల నిర్వహణలో అవినీతికి ఎన్ని మార్గాలున్నాయో లెక్క కట్టి చెప్పమని వుండినా - కోటి పద్ధతుల సూచించి తిరుగులేని స్కోర్‌తో గోల్డ్ మెడల్ మెడలో వేసుకొని వచ్చి వుండేవారు. మనం ఇంత నైపుణ్యం సాధించిన విద్యను ఒలింపిక్ పోటీల జాబితాలో చేర్చకపోవడం నిస్సందేహంగా అగ్రరాజ్యాల కుట్రే!

దాన్ని బహిర్గతం చేయడానికి ఒక పార్లమెంటరీ ఉపసంఘం నియమించాలని ఎన్టిరామారావు గారు ఇంకా కోరలేదనుకుంటాను.

ఎందువల్లనో వివి సింగ్‌కు కూడా, ఒలింపిక్స్ పట్ల ఇంకా ఆసక్తి కల్గలేదు.

కల్గి వుంటే ఏమి చేసి వుండేవారు?

ఒలింపిక్ అసోసియే... అధ్యక్షుడుగా ఎంపికై, భారత్ వంటి బలహీన దేశాలకు సగం మెడల్లు రిజర్వు చేయాలని పట్టుబట్టి వుండేవారు; తన మాట వినకుంటే అధ్యక్ష పదవికి రాజీనామా చేస్తానని బెదరించి వాడు.

ఈ పద్ధతేదో బాగానే వున్నట్లుందే మనమూ మెడల్లు సాధించడానికి!

ఒలింపిక్స్‌లో భారతదేశం సృష్టించిన చరిత్రను ప్రపంచానికి చాటి చెప్పడంలో పత్రికలూ అగ్ర రాజ్యాల కుట్రకు లోబడి పోయాయి.

అదెట్లా?

పతకాలు సాధించిన దేశాల జాబితా మాత్రం ప్రకటించి, సాధించని దేశాల జాబితా ప్రకటించక పోవడం పత్రికలు చేస్తున్న తప్పు. పై నుంచి క్రిందికి గాక, క్రింద నుంచి పైకి లిస్ట్ వేస్తే మొట్టమొదటి పేరు మనదే కదా? అమెరికా పేరు ఆఖరులో గాని కన్పడదు గదా? అప్పుడు ప్రతి భారతీయుడు గర్వంగా ఫీలవచ్చు గదా? మనకాపకారం ఇవ్వని పత్రికలను ప్రపంచ కోర్టుకీడ్చి పారేయాలి!

## పినాకినీ తీరం

(2 పేజీ కొరవ)

ప్రాధాన్యతెంత? ఇప్పటి వరకు తన స్థాయి, అంతస్తులేమిటి? నేటి పరిస్థితి రేపు వుంటుందా, వుండదా? నేటి ప్రాభవం శాశ్వతమా, తాత్కాలికమా? నేడు చుట్టూ చేరి బ్రహ్మరథం పట్టే జనం, జేజేలు చెప్పే జనం ఎందుకోసం చేస్తున్నారు? ఇటువంటి వేమీ పరిగణనకు తీసుకోకుండా ఆర్భాటాలు ఆడంబరాలకు పూనుకోవడం హాస్యాస్పదంగా వుంటుందని పించలేదా శంకర రెడ్డి గారికి? తాను నిరాడంబరుడు; అను క్షణం ప్రజల మధ్య తిరిగే సామాన్య సేవకుడు; అందరికీ అందుబాటులో వుండే వ్యక్తి. అటువంటి తనకు ఈ ఆటోపం ఒంటి మీద తేళ్లు జెర్రులు పాకినట్లనిపించలేదా?

శంకరరెడ్డికి రీజినల్ ఛైర్మన్ పదవి వచ్చినందుకు అందరూ సంతోషించారు; విశ్వాసపాత్రత వృధాపోలేదని కూడా అభిప్రాయ పడ్డారు. ఆ విధంగా మురిసి పోయిన శంకర రెడ్డి మిత్రులు, అభిమానులు ఈ ప్రదర్శనాన్ని చూచి విచార పడుతున్నారు, ఆ శంకర రెడ్డేనా ఈ శంకర రెడ్డి అని ఆశ్చర్య పోతున్నారు. పదవి వచ్చింది; దానికి సంతోషపడవలసిందే. కాని ఎన్నిసార్లు ఎన్ని చోట్ల ఎన్ని వుత్సవాలు, అభినందన సభలు? పదవి ప్రకటన వెంటనే వెంకటగిరిలో పెద్దవేడుక, వూరేగింపుల సంబరాలు. అది అభిమానులు వుత్సాహం కొద్దీ జరుపుకున్నార నుకుందాం. ఆ తర్వాత మూడు బస్సుల నిండా జనంతో హైదరాబాదుకు కృతజ్ఞతాయాత్ర. ముఖ్యమంత్రి వెంకటగిరి నియోజక వర్గీయుడే కావచ్చు; పదవి ఇచ్చింది ఆయనే కావచ్చు. కాని ఆయన అసంఖ్యాకమైన సమస్యలతో, సవాళ్లతో, పని త్రిదులతో విసిగి వేసారి పోతుంటారు గదా - కృతజ్ఞత చెప్పదలచుకుంటే శంకర రెడ్డి తానక్కడు పోయి మంచి పూల మాలవేసి, వంగి నమస్కరించి వస్తే సరిపోదూ. కాని జిందాబాద్ కేకలతో, జైజై నినాదాలతో ఆయనకు తల తిక్క పుట్టించి, వూదరబెట్టినట్లు వ్యవహరించి చిరాకు కలిగే వరకు ఎరవ తీసుకోవడం ఎంత వరకు భావ్యం?

పదవీ స్వీకారానికి నెల్లూరుకు బయలు దేరే ముందు వెంకటగిరిలో శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ ఆశీర్వాదాలు పొందడానికి ఒక సభ; అందులో అభినందనో పన్యాసాలు. అంత వరకు బాగానే వుంది. కాని యాభై కార్లలో ఇతర వాహనాలతో వెంకటగిరి నంతా తరలించుకొని వచ్చి నెల్లూరు రాజవీధులలో ప్రదర్శన చేయాల్సిన అవసరం ఏమొచ్చింది? అది ప్రజల్లో ఎంత వ్యతిరేకాభిప్రాయన్ని కల్గించిందో శంకర రెడ్డికి గాని, ఈ కార్యక్రమాలకు ప్రోత్సహించే ఆయన అభిమానులకు గాని ఏమి తెలుస్తుంది? అన్ని కార్లు, వాహనాలు, జనం రావడానికి ఎంత ఖర్చవుతుంది? అది ఎక్కడ నుండి వస్తుంది? ఎవరు భరిస్తారు? నెల్లూరు ఇందిరా కాంగ్రెస్ భవనంలో ఒక అభినందన సభ; బాజా నందాల మోత అది ఎవరు ఏర్పాటు చేసినా అందులో ఎందరు మాట్లాడినా ఎవర్ని చూచి, ఎందుకోసం అనేది వూహించ వచ్చు. కేవలం శంకర రెడ్డి గారి కోసం మాత్రం వుండదు.

ఇదే పదవిని శ్రీ వక్ర ప్రకాశరావు కూడా అలంకరించారు; ఆయనా పదవీ స్వీకారం చేశారు. ఎవరికైనా తెలుసా? ఎవరికైనా చెప్పుకొన్నారా? ఏమైనా సందడి వుండిందా? ఆ పొంగులు హంగులు లేకపోవడమే అర్హత, యోగ్యత, ఆదర్శం. చిన్న పదవికి పెద్ద హంగామా చేయడం కాదు, పెద్ద పదవినైనా నిశ్శబ్దంగా నిరాడంబరంగా చేపట్టడంలోనే విలువ. శంకర రెడ్డి గారు కూడా ముందు రోజు రాత్రి పదవీ స్వీకారం చేసినట్లు ఆర్.టి.సి. ఆఫీసులో సంతకం పెట్టారట; అధికారకంగా చార్జి తీసుకున్నాడట. ఆ కార్యక్రమాన్ని అంతటితో సరిపెట్టు కొని వుంటే ఎంత హుందాగా వుండి వుండేది? శంకర రెడ్డి గారి సహజమైన మంచి తనానికి, నిరాడంబరతకు ఇంకెంత రాణింపు కలిగి వుండేది? ఈ విషయంలో శంకర రెడ్డి పొరపాటు చేశారు; ఇక ముందు చేయకుండాలని [illegible] నా కోర్కె.

NSR

## పెళ్ళకూరు

(2 పేజీ కొరవ)

పెళ్లకూరు ప్రసంగం ముక్తసరిగా వుండింది. అప్పటికే అలసిపోయాడేమో- ఎక్కువ మాట్లాడలేక పోయారు. తనకు గుడిలో ఒక దేవుడుంటే, పివిలో రెండవ దేముడున్నాడని; నరసింహారావు పలకరింపే ఆస్పత్రిలో తనకు ప్రాణం పోసిందని, పునర్జన్మ ఇచ్చిందని చెప్పారు. ఇఫ్కో యాజమాన్యంలో ఆంధ్రలో ఒక ఫ్యాక్టరి పెట్టాలని వుందన్న అభిలాష వ్యక్తం చేశారు.

## జనవాణి

3 పేజీ కొరవ

ఇప్పటికే చాలామంది డాక్టర్లు, ఇంజనీర్లు రాష్ట్రంలో నిరుద్యోగులుగా వున్నారు. ప్రభుత్వం మెడికల్ కాలేజీల విషయంలో పునరాలోచన జరపాలి.

-సూరం సురేష్

నెల్లూరు.

## సింహపురి

(4 పేజీ కొరవ)

పోస్టుమాస్టర్ వంటి కథలలోని కవితాధోరణిని, మానవతకు రవీంద్రుడు చేసిన అక్షరాభిషేకాన్ని సవివరంగా వివరించారు.

ఈ సభ మే 8 తేది జరగవలసింది. కాని కరెంట్ కోతవల్ల అర్ధంతరంగా ముగియడం వల్ల ఇప్పుడు తిరిగి జరిపించారు. సభను శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డిస్వాగతించారు; శ్రీ టి. నరసింహులు వందనాలు చెల్లించారు. సభా పోషకుడు శ్రీ పివి రమణారెడ్డి

## బహిరంగ ప్రకటన

ఇందుమూలముగా యావన్మందికి తెలియ జేయడమేనగా ఈ క్రింద కనపరచిన షెడ్యూలు దాఖలా ఆస్తిని నా కక్షిదారుడైన జయమణి ఫౌండ్రి మేనేజరు పెరియ స్వామి పిళ్ళై కణ్ణన్ S/o. పెరియస్వామి పిళ్ళై 4-2-160 ఓల్డు బోయగూడ, సికిందరాబాదు - 3 అనువారలకు వ్యాపార లావాదేవీల తాలూకు 31.1.92కు అక్షరములా ఒక లక్ష తెబ్బైవేలు బాకీ పడిన నిమిత్తం సదరు బాకీని కృషి ప్రాడక్ట్సు సేల్స్ & సర్వీసు ప్రొప్రయిటర్ యస్. నరసింహారావు మరియు S. వెంకట సుబ్బమ్మ ఉరఫ్ సరోజనమ్మ భర్త S. నరసింహరావు వార్ల ఆస్తిని కొల్లేటరల్ సెక్యూరిటీగా ఉంచిసదరు అప్పు పత్రములను నా కక్షి దారుడు, పైన చెప్పబడ్డ కంపెనీ వార్లకు బాకీకి గాను స్వాధీనము చేయడమైనది.

కాన క్రిషి ప్రాడక్టు వారు సదరు విషయములను కప్పి పుచ్చి పై ఆస్తి అన్యాక్రాంతము చేయుచున్నారని తెలియుచున్నది. అటుల ఎవరైనా సదరు ఆస్తిపై అప్పులు గాని, లీజు అగ్రిమెంటు కాని వగైరా లావాదేవీలు జరిపిన యెడల నా కక్షిదారుడు అయిన జయమణి ఫౌండ్రి కంపెని తీసుకొను క్రిమినల్, సివిల్ చర్యలకు బాధ్యులగుదురని తెలియజేయడమైనది.

### షెడ్యూలు

నెల్లూరు రిజిస్ట్రేషన్, గూడూరు సబ్ డిస్ట్రిక్ ముత్యాలపాడు గ్రామం, పట్టా 15, స.నెం. 60, 62-A, 62-B, 58-A, 58-B, 96/1A, 96/3A మొత్తం విస్తీర్ణం 14-34 ఎకరములు.

కక్షిదారు తరపు న్యాయవాది

యం. సూర్యప్రకాశరావు, కస్తూరి దేవి నగర్, నెల్లూరు

రజనీకాంత్ వేడికోలు

# నా సినిమాలు నాకుంచండి- రాజకీయాల్లోకి త్రోయకండి!

## రాజకీయాలకు వస్తే మనశ్శాంతి కరువు : జయలలిత

ఇటీవల రజనీకాంత్ నటించిన "అణ్ణామలై" చిత్రం విడుదలైనప్పుడు అతని అభిమాన సంఘాల వారు "కాబోయే తమిళనాడు ముఖ్యమంత్రి" అంటూ పోస్టర్లు ప్రత్యేకంగా అచ్చు వేయించి మధురై, తిరుచిరాపల్లి, కుంభకోణం వగైరా చోట్ల అంటించారు. తమిళ హీరోలలో రజనీ కాంత్ నెంబర్ - 1; అతనికున్నన్ని అభిమాన సంఘాలు మరెవరికీ లేవు. జయలలిత అంటే గిట్టని వారు ప్రచురించే తమిళ పత్రికలు కూడా అతనే కాబోయే ముఖ్యమంత్రి అంటూ ఆశాభావం వ్యక్తం చేశాయి. ఈ విషయమై వీళ్ళద్దరి మధ్య పోటీ ఏర్పడనున్నట్లు చాలా మంది భావించారు. దీనితో తమిళనాడు ప్రభుత్వం అతని పై కన్ను వేసి ఉంచిందన్న వదంతులూ వ్యాపించాయి.

వాస్తవానికి రజనీకాంత్‌కు రాజకీయాల పట్ల అంత ఆసక్తి లేదు. ఆ విషయాన్ని తరచు స్పష్టం చేస్తూ వచ్చారు కూడా.

ఈ మధ్య దక్షిణ భారత చలన చిత్ర వాణిజ్య మండలి భారీ ఎత్తున జయలలితకు అభినందన సభ ఏర్పాటు చేసింది. ఆ సభలో రజనీకాంత్ ఉపన్యసిస్తూ "నా సినిమాలు – నా ఇల్లు తప్ప నాకు వేరే ప్రపంచం లేదు. భగవంతుడా నన్ను రాజకీయాలలోకి తొయ్యకు" అని అనుదినం ప్రార్థిస్తుంటాను. రాజకీయాలలోకి ప్రవేశిస్తే, మనశ్శాంతి ఉండదని నాకు తెలుసు. ప్రజలకు సేవ చేయాలంటే, రాజకీయాలలోకి ప్రవేశించనక్కర్లేదు అంటూ వేదిక దిగి వెళ్లి, తన ప్రక్క సీట్లో కూర్చొనున్న కమలహాసన్‌తో, "బాగా మాట్లాడానా?" అన్నాడు "సుపర్బ్!" అని మెచ్చుకున్నాడు కమల్‌హాసన్.

ఆ తర్వాత ప్రసంగించిన జయలలిత "రజనీకాంత్ చక్కగా మాట్లాడారు. ఆయన చెప్పినట్లు రాజకీయాలలోకి ప్రవేశిస్తే ఏది కావాలన్నా లభిస్తుంది గాని, మనశ్శాంతి మాత్రం లభించదు. కాని, ప్రజలకు సేవ చేయాలనే ఉద్దేశ గలవారు రాజకీయాలలోకి ప్రవేశించినా తప్పులేదు. రేపు ఏమి జరుగుతుందో ఎవరికి తెలుసు? సంజయ్ గాంధీ ప్రధాని అవుతాడనుకుంటే, రాజీవ్ గాంధీ అయ్యారు. రాజకీయాలనుంచి విశ్రాంతి తీసుకోవాలని అనుకుంటున్న సమయంలో నరసింహారావు గారి తల మీద ప్రధానిత్వమనే ముళ్ల కిరీటం పెట్టబడింది. అంచేత, మన చేతుల్లో ఏమీ లేదు" అంది నవ్వుతూ.

### సెప్టెంబర్‌లో భార్గవ్ ఆర్ట్స్ చిత్రం

స్క్రిప్టు పకడ్బందీగా తయారైతే గాని షూటింగ్ ప్రారంభించని నిర్మాతలలో భార్గవ్ ఆర్ట్స్ ఎస్. గోపాల రెడ్డి ఒకరు. ద్విపాత్రలు నిర్వహించే బాలకృష్ణ సరసన మీనా – రోజా నాయికలుగా నటించే ఈయన కొత్త చిత్రానికి సెప్టెంబరులో ప్రారంభోత్సవం జరుగుతుంది. కోడి రామకృష్ణ దర్శకుడు.

# తెరపై రాజీవ్ హత్యోదంతం!

సంచలనం కలిగించిన వార్తల స్ఫూర్తితో చిత్రాలు రూపొందించడం డైరక్టర్ ఆర్.కె.సెల్వమణికి ఎంతో ఇష్టం. ఈయన గతంలో హంతకుడు 'ఆటోశంకర్' ఇతివృత్తంతో 'పోలీస్ అధికారి' 'స్మగ్లర్ వీరప్పన్ ప్రేరణతో ' కెప్టెన్ ప్రభాకర్' తీశారు. ఇప్పుడు మాజీ ప్రధాని రాజీవ్ గాంధీ దుర్మరణానికి ముందు వెనుకగల సంఘటనల ఆధారంగా తమిళంలో 'కుదిపత్రికై' (చార్జిషీట్) తీస్తున్నారు. ఇది తెలుగులో 'విధ్వంసం'గా పరివర్తన చెందుతోంది. మద్రాసు విమానాశ్రయం నుంచి రాజీవ్ గాంధీ శ్రీపెరంబుదూరుకు వచ్చి, అక్కడ బలి కావడం, శివరాసన్‌తో పాటు అతని అనుచరులు సైనైడ్ గుళికలు మింగి, ఆత్మాహుతి చేసుకోవడం ఈ సినిమా ముక్తాయింపు. రాజీవ్‌గాంధీగా హిందీ నటుడు అనుపమ్‌ఖేర్ నటిస్తున్నారు. ఆయన మృత్యువుకు కారకులైన శివరాసన్, ధాను, నళిని, ఫోటోగ్రాఫర్ హరిబాబు పాత్రలను వాళ్ళను పోలిన వ్యక్తులు నిర్వహిస్తున్నారు. తమిళనాడు, ముఖ్యమంత్రిణి జయలలిత పాత్రను అచ్చం ఆమెలాగే ఉన్న ఓ కొత్త నటి ధరిస్తోంది. మొత్తం మీద ఇదొక సంచలన చిత్రం కాగలదు. మాటలు. కొంపల్లి విశ్వం, సంగీతం. ఇళయరాజా, ఛాయ. రవి యాదవ్, నిర్మాత. టి.ఎ.ఎస్.ఎన్. ప్రసాద్.

### శ్రీనాథ కవి సార్వభౌమ

శ్రీమతి బసవరామతారకం మెమోరియల్ మెడికల్ ట్రస్ట్ బ్యానర్‌లో నిర్మితమయ్యే పై చిత్రానికి ఆగస్ట్ 5 న కొన్ని శ్లోకాలు, సి. నారాయణ రెడ్డి వ్రాసిన రెండు పాటలు రికార్డయ్యాయి. సెప్టెంబరు నెలంతా హైదరాబాద్‌లో షూటింగ్ ఉంటుంది. ఔట్‌డోర్ షూటింగ్ నవంబర్‌లో జరుగుతుంది. అంత వరకు ఎన్.టి.ఆర్.సినిమా రంగంలో బిజీగా ఉంటారని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. మాటలు : ముళ్ళపూడి వెంకట రమణ, సంగీతం : కె.వి. మహదేవన్, ఛాయ : మోహన్‌కృష్ణ, శిల్పం : భాస్కర రాజు, సహదర్శకుడు : కె.వి. రావు. దర్శకత్వం : బాపు.

### సెన్సార్‌తో సవాల్ చేయబోతున్న "తొలిముద్దు"

ప్రశాంత్ తాను బాక్సింగ్‌లో గెలిస్తే, దివ్యభారతిని ముద్దు పెట్టుకుంటానని సవాల్ చేసి, గెలుపొందుతాడు. అందుకని చిత్రం టైటిల్‌ని "తొలిముద్దు"గా నిర్ణయించారట. ఈ పేరు ప్రేక్షకుల నోళ్ళలో ఎట్లా నానుతుందో దర్శకుడు కె. రుఘ్వేంద్ర రెడ్డి గాని, నిర్మాత జి. రాధాదేవి గుప్త గాని ఆలోచించినట్లు లేదు. ఈ చిత్రం హిందీ మాతృక పేరు "దిల్"; ఎంత చక్కగా ఉంది? తెలుగు టైటిల్ దిగజారవలసిన అవసరం ఏముంది? ముద్దు పేరు తెలుగు ప్రేక్షకులకు ముద్దు కల్గిస్తుందా?

### "ఏంటి బావా మరీనూ",

రాజేంద్రప్రసాద్‌తో హైదరాబాద్‌లో ప్రారంభమైన "బావలున్నారు జాగ్రత్త" చిత్రం ఇప్పుడు నరేష్ హీరోగా మార్పిడి జరగగానే, పేరు కూడా "ఏంటి బావా మరీనూ" అని మారింది. దీనికి డైరక్టర్ రేలంగి నరసింహారావు ఏం వివరణ ఇస్తారో?

### పుంజుకుంటున్న కృష్ణ

ఈ మధ్య తెరమరుగైన హీరో కృష్ణ మెల్లమెల్లగా పుంజుకుంటున్నారు. మహారథి చిత్రం కాక డైరెక్టర్ భరద్వాజ నిర్మించే చిత్రంలో ఆమని సరసన నటించనున్నారు. "బేటా" హిందీ చిత్రం ఆధారంగా ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకత్వం వహించే చిత్రంలో కృష్ణ సరసన విజయశాంతి నటించవచ్చు.





అయ్యయ్యో బ్రహ్మయ్యలో నందిని, నరేష్

# చచ్చు సస్పెన్స్, చెత్త కథ

# డిటెక్టివ్ నారద

ఈ చిత్రానికి వంశీ దర్శకుడు. దర్శకుడుగా వంశీకి సినిమా రంగంలో ఒక ప్రత్యేకత వుంది. ఆయన చిత్రాలన్నీ ఒక ఉన్నత స్థాయిలో వుంటాయి. మంచి కథ వుంటుంది. సజీవమైనపాత్రలుంటాయి. ఆ పాత్రలన్నీ ఒక ధ్యేయంతో, ఆదర్శవంతంగా నడుస్తాయి. కథా గమనంలో అవసరమైన దృశ్యాలు, పటుత్వంగా కనిపిస్తాయి. పాటల చిత్రీకరణలో దృశ్యరూపం రమ్యంగా వుంటుంది. ప్రేక్షకుల మనసును బిగబట్టి నడిపించే సస్పెన్సు వుంటుంది. గిలి గింతలు పెట్టే హాస్యముంటుంది.

కాని, "డిటెక్టివ్ నారద" చిత్రంలో ఇవన్నీ మృగ్యం. ఒక పనికి మాలిన కథతో ఈ చిత్రం నిర్మించారు. ఇంత చచ్చు కథ వంశీ ఎట్లా వ్రాశాడో అర్థం కాదు. అంతా గందరగోళంగా సాగుతుంది. ఒక రకంగా ఇది నేరపరిశోధన చిత్రం. ఈ నేర పరిశోధనలోకి డిటెక్టివ్ నారద ప్రవేశించే అవసరం ఏమొచ్చిందో, అతను చేసిన నేర పరిశోధన ఏమిటో, అసలు అటువంటి పరిశోధన ఎందుకో అర్థంకాదు. అలాగే నారద చేసిన ఇంద్రజాల మహేంద్రజాలాలు, మిలటరీ ఆఫీసర్ తూటాలు పేలిస్తే, శరీరంతూట్లు పడటం పోయి అవి పూలమాలలుగా మారి నారద మెడలో పడటం వంటి అభూత కల్పనలు ఇవన్నీ అసలు కథను నడపటం చేత గాక తొక్కిన అడ్డదారుల్లా కనిపిస్తాయి.

కథా గమనంలో పాత్రలను నడిపిన తీరు గూడా విచిత్రంగా వుంది. ఏ పాత్ర ఏంచేస్తున్నదో ఏం మాట్లాడుతున్నదో, అగమ్య గోచరంగా వుంది. ముఖ్యంగా నారద సహాయకురాలు అడిగే ప్రశ్నలకు, ఆ సన్నివేశాలకు, సినిమాకు సంబంధమే వుండదు. దీనికి తోడు నారద మగ అసిస్టెంట్ జంతర్ మంతర్ యక్షప్రశ్నలు, మినీకవితలు, పొడుపు ప్రశ్నలు చిత్రాన్ని మరింత చిందర వందర చేశాయి.

చిత్రసమీక్ష
గ్రద్దబూరు గోపాలరావు

ఇక ఇళయరాజా సంగీతం కూడా ఈ చిత్రాన్ని తన వంతుగా కొంత దెబ్బ తీసింది. నేపథ్య సంగీతం శబ్దమయంగా వుంది. "అందమైన జంతులు ఇంటనుండగా, బృందావనమూ ఊటీ పోనేలనే" - అనే దానికి వీళ్ళ స్వంత కవిత్వం కొంత చేర్చి పాడగా బాగుంది.

ఈ చిత్రంలో సస్పెన్సు వుంది. కాని అది చాలా చౌకబారు సస్పెన్సు. పద్మజ అనే అమ్మాయి తనకు కడుపొచ్చినట్లు చీర క్రింద దిండు పెట్టుకొని అందర్నీ సస్పెన్సులో ముంచుతుంది. ఆమె అలా

కొరవ 11 పేజీలో

# సిరుల సింహపురిలో విద్యాసౌరభం వ్యాపింప చేయనున్న వారందరికీ వందనాలు !

## శ్రీ వేణుగోపాలస్వామి కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్

ఆనం వెంకన్న నగర్ – నెల్లూరు
( ఎసి నగర్ సమీపం )







నూతన భవన సముదాయానికి
శంకుస్థాపన జరుగుతున్న శుభసందర్భంలో
ముఖ్యమంత్రి

## శ్రీ ఎన్. జనార్దన రెడ్డి గారికి

## మా హార్దిక స్వాగతం

కళాశాల ప్రగతికి నెల్లూరు టౌన్ అభివృద్ధికి నిరుపమాన సేవ చేస్తున్న
సింహపురి సేవా సమితి కన్వీనర్, కాలేజి కరస్పాండెంట్

## శ్రీ ఆనం వివేకానంద రెడ్డికి

మా అభినందనలు



పుచ్చకాయల రాఘవ రెడ్డి.–
నెల్లూరు

## కన్యాశుల్కం

(4 పేజీ కొరవ)

were married at the age of Five Years, forty four at four thirty six at three, six at two and three at the age of one! - Babies in the last instance carrying a price of from three hundred fifty to four hundred rupees a head. Some times bargains are stuck for children in the womb. Such a scandalous state of things are disgrace to society and literature can not have a higher function than to show up such practices and give currency to a high standard of moral values. These consid erations prompted me to compose "Kanya Sulkam".

ఈ నాటకం ఎంతగా ప్రజల హృదయాల లోనికి చొచ్చుకు పోయిందంటే అందులోని సంభాషణలను, పాత్రలను సమకాలీన వ్యక్తులకు సరిపోల్చడం సర్వసాధారణమైంది. లోభిని చూసి 'వీడెవరో లుబ్ధావధాన్లను గుర్తుకు తెస్తున్నాడు" అనడం, లౌక్యంతో రాజకీయం నడిపే పెద్దలను, రామప్పంతులు రాజకీయం జరుపుతున్నారనడం, ఛాందస మూర్తులను కొపిష్టులను అగ్నిహోత్రావధాన్లు తో పోల్చడం మనం నిత్యం చూస్తూనే ఉన్నాం. ఇందులో సంభాషణలు కూడా చాలా చాలా సందర్భాల్లో ప్రత్యేకంగా ఉటంకించ బడటం కూడా జరుగుతుంది. ముఖ్యంగా గిరీశం పాత్ర సంభాషణలు మామూలు ప్రజల అభిరాభిమానాలు చూరగొన్నాయి. "డామిట్! కథ అడ్డం తిరిగింది" "నాతో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషన్" "ఆత్మానుభవం అయితే గాని తత్వం బోధ పడదు" "నా పేరు గిరీశమే! వినవర భీషణశంఖము దేవదత్తమే" వంటివి కోకొల్లలు. ఇతర పాత్రలు, వాటి సంభాషణలు కూడా పేరు గడించాయి.

తాంబూలాలిచ్చేశా తన్నుక చావండి

ఆడదాన్ని నోరు బిట్టుకొని బతకమనే చేశారు దేవుడు

నువ్వులేమన్నా జాగర్త చేశారా అన్నా!

మైడియర్ షేక్స్పియర్! నీ తండ్రి అగ్గి రావుడోయ్

చెట్టుకి చావనలుపు. మనిషికి చావ తెలుపు. అనగా చీకట్లో నక్షత్రాల్లాగా అక్కడక్కడా తెల్లవెంట్రుక తగిల్తేనే చమక్కు

విద్యవంటి వస్తువులేదు. నిజమే, ఒక్కటి తప్పు – విత్తం. డబ్బులేని విద్య దారిద్ర్య హేతువు

బుచ్చమ్మ సాక్షాత్తు పరమ పవిత్రమైన విడోవిల్ గిల్టలెటర్స్... టు మారీ ఎ విడో ఆర్ నాట్ టు మారీ – ద టీజ్ ది క్వశ్చన్

తొందరపడి "హాజీసాహెబ్ తురకల్లో కలిసిపోయినా దన్నట్లు" వంటి సంభాషణలు మచ్చుకు మాత్రమే. మరెన్నో ఆసక్తికరమైన, హాస్య స్ఫోరకమైన సంభాషణలు చోటు చేసుకున్నాయి.

పాత్రల చిత్రీకరణలో ప్రతిపాత్రా రచయిత ప్రతిభను చాటుతుంది. చిన్న చిన్న పాత్రలు సైతం చాలా నేర్పుగా, నైపుణ్యంగా చిత్రించబడ్డాయి. గిరీశం, మధురవాణి, రామప్పంతులు, బుచ్చమ్మ, అగ్నిహోత్రావధాన్లు లుబ్ధావధాన్లు వెంకటేశం, కరటక శాస్త్రి, వెంకమ్మ, మీనాక్షి, సౌజన్య రావు పంతులు తదితరపాత్రలు సజీవంగా, సంఘంలో పరిస్థితికి దర్పణం పట్టే విధంగా అత్యంత వైవిధ్యంగా మలచబడ్డాయి.

కన్యాశుల్కం సాంఘిక సమస్యా నాటకం. తెలుగులో సంఘసమస్యకు అద్దం పట్టే నాటకాల్లో ఇంతకు మించిన నాటకం లేదంటే అతిశయోక్తి కాదు. సమకాలీన వాస్తవిక జీవితాన్ని ప్రతిబింబించిన రచన ఇంత సమగ్రంగా ఇతర భాషల్లో సైతం వెలువడలేదు. పాశ్చాత్య నాటక రచయితలలో ఇబ్సన్‌కు గల స్థానం ప్రాచ్యనాటక కవులలో గురజాడ వారిదే అనక తప్పదు అని శ్రీశ్రీ వ్యాఖ్యానించారు. ఇంతటి పరమోత్కృష్ట నాటకాన్ని 'క్లాసిక్' గా శ్రీశ్రీ అభివర్ణించారు. టి ఎస్‌ఇలియట్ పేర్కొన్నట్లు క్లాసిక్ ఇతరులకు అనుకరణ సాధ్యం కాని ప్రయోగం అయి ఉండాలి. 'క్లాసిక్' కావ్యానికి ఉండవలసిన లక్షణాలను గూర్చి చెపుతూ Maturity of Mind, Maturity of Manners, Maturity of Language and Perfection of the Common Style నాటక ప్రక్రియకు అనువుగా అన్వయించుకుంటే, కన్యాశుల్కం ఈనాల్గు లక్షణాలకూ సలక్షణంగా నిలిచే నాటకం. విస్తృతమైన ఇతివృత్తం కలిగి ఉండడం 'ఎపిక్' లక్షణమైనా, ఏదైనా ఒక ఉజ్వల ఘట్టం సమాజంలో జరిగినప్పుడు దాన్ని స్వనేత్రాలతో చూచిన ఒక రచయిత దాని భౌతిక, తాత్విక స్వభావాల నావిష్కరిస్తూ ఒక సాహితీ కళాఖండాన్ని గొప్ప రచనగా వెలువరిస్తే దాన్ని ఎపిక్ అనవచ్చు అనే కె.వి.ఆర్ గారి అభిప్రాయం ప్రకారం గురజాడ వారి కన్యాశుల్కానికి ఈ ప్రమాణాలన్నీ సరిపోతాయి.

ఒక సామాజిక సమస్య యొక్క సమగ్ర చిత్రం కన్యాశుల్కం నాటకం. "Kanya Sulkam remains a mater-piece in the different realm of Social Satire" అని శ్రీ కట్టమంచి వారిచే ప్రశంసల నందిన నాటకం. ఇటువంటి నాటకాన్ని అందించి శ్రీ గురజాడ అప్పారావు గారు ఆంధ్ర నాటక రంగానికి ఎనలేని సేవచేశారు. అది ఆవిర్భవించి నూరేళ్ల పూర్తయినా నేటికిదాని విలువ, ప్రతిభ దినదిన ప్రవర్ధమానమౌతున్నా యేగాని ఏ మాత్రమూ విలువ తగ్గడం లేదు. అటువంటి ప్రతిభా పాటవాలు గల నాటకంలో వాడిన భాష సాధారణ వాడుక భాష అయినా పాత్రోచితంగానూ, వినోద భరితంగానూ, ఉత్కంఠ పూర్వకంగానూ ఉండి మనలను ఆ భావనలలోకి తీసుక వెళ్తుందనడంలో సందేహం లేదు. మహా సంస్కర్త, మహాకవి శ్రీ గురజాడ కలం నుండి వెలువడ్డ కన్యాశుల్కం శతజయంతి సందర్భంగా ఆ మహనీయుడ్ని స్మరించుకోవడం ప్రతి ఆంధ్రుని కర్తవ్యం. ఆ నాటకాన్ని పునఃస్మరించుకోవడం మనందరి బాధ్యత.

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

నాటకమాడేందుకు ఆమె చెప్పిన కారణమేమిటంటే – ఒక మంచి తండ్రికి వున్న ముగ్గురు అవినీతి పరుల్లైన కొడుకులను మార్చేందుకు అట్లా వేషం వేసిందట.

ఒక మంచి తండ్రికి ముగ్గురు దుర్మార్గులైన కొడుకులుంటారు. వారు స్మగ్లింగ్, బూతు పుస్తకాల ముద్రణ, వంటి ఎన్నో అవినీతి కార్యక్రమాల్లో మునిగి తేలు తుంటారు. వారి ఇంట్లో వచ్చి చేరిన పద్మజ(విలోషా)ను ముగ్గురూ అనుభవించాలని పన్నాగం పన్నుతారు. వీరికి బుద్ధి చెప్పేందుకు పద్మజ తనకు వీరి వల్ల కడుపొచ్చిందని ఒక దిండు చీర క్రింద వుంచుకుంటుంది. తనకు గర్భం చేసిన నేరస్థుణ్ణి పట్టుకోమని తన స్నేహితురాలు శారద ద్వారా డిటెక్టివ్ నారదను(మోహన్‌బాబు) నియమిస్తుంది. కొడుకుల్లో మార్పు రావడం; వారిలో ఆ మార్పు తెచ్చేందుకే తానిలా నాటక మాడానని చెప్తూ పద్మజ చీర క్రింద నుంచి దిండుతీసెయ్యటం జరుగుతుంది.

వంశీ వ్రాసిన కథ, స్క్రీన్‌ప్లే అతను నిర్వహించిన దర్శకత్వం అన్నీ చాలా తక్కువ స్థాయిలో వున్నాయి.


**జమీన్‌రైతు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 100.00 |
| ఆరు నెలలకు | రూ. 50.00 |
| విడి ప్రతి | రూ. 2.00 |



నెల్లూరులో
6-8-1992 తేదిన
అతి వైభవంగా జరిగిన
వివాహమహోత్సవమున
దంపతులైన చిరంజీవులు

## మోహన్

## రూపల

వైవాహిక జీవితం
ఆనంద దాయకం కావాలని ఆకాంక్షిస్తూ.











**హోటల్ నాగార్జున రెసిడెన్సీ మేనేజ్‌మెంట్**
బెంగుళూరు

---

**పల్లవగ్రానైట్స్ మేనేజ్‌మెంట్**
మద్రాసు

---

**దేవిరెడ్డి శేషారెడ్డి**
విశాఖపట్నం

---

**దేవిరెడ్డి కృష్ణారెడ్డి**
నెల్లూరు

---

**పఠాన్ నవాబ్ ఖాన్**
నెల్లూరు

---



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayapa